
అసలైన ఆనందం వీటి సువాసనలో వుంది
పార్లే
ఫ్రూట్ డ్రాప్స్
చూడండి ఈవింత...ఆహా ఏమి ఈ అద్భుతం!
మీకు ఎన్నో తియ్యటి బిళ్లలు లభిస్తాయి రంగు
రంగుల తియ్యటి బిళ్లలు...ఎన్నో రుచులు...
రాస్ప్బెరీ, బత్తాయి, అనాసకాయ, నిమ్మకాయ,
కమలా ఫలము. ఎంత తక్కువ ధర!
ఉవ్విళ్లూరించే
అయిదు పండ్ల రుచులు ప్రతి
ప్యాకెట్‌లో 10 బిళ్లలు లభిస్తాయి.
FRUIT DROPS
PARLE
FRUIT DROPS
FRUIT DROPS
everest/980/PP tl

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫొటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.







రెమి ®

టాల్కం పౌడర్






సమృద్ధిగా
పాలు
మరియు
పెరిగే
శక్తియు
కలిగినవి

బ్రిటానియా

# గ్లేక్సో®

బిస్కట్లు




పసి బిడ్డలకు సంపూర్ణమైన గట్టి
ఆహారము, బాగా పాల పుష్టితో అద్భుతమైన పర్యవేక్షణతో
తయారు కాబడింది. మీ పసిబిడ్డకు, మీ కుటుంబంలో
అందరికి ప్రతిరోజూ ఇవ్వండి.

® ది బ్రిటానియా బిస్కట్ కో లిమిటెడ్
ట్రేడు మార్కును ఉపయోగించుటకు
రిజిష్టరు దారులు

బ్రిటానియా అంటే నాణ్యత



జూలై
29
విడుదల

అన్నా చెల్లెళ్ళ అనురాగానికి అపూర్వ రూపకల్పన

ఏవి.యం ప్రొడక్షన్స్ సమర్పించు మురుగన్ బ్రదర్స్ వారి

# చిట్టి చెల్లెలు




దర్శకత్వం: యం. కృష్ణన్ సంగీతం: యస్. రాజేశ్వరరావు రచన: డి.వి. నరసరాజు బి.ఎ.

నిర్మాతలు: యం. మురుగన్, యం కుమరన్, యం. శరవణన్

# అందరికంటే ముందుగా అడుగులు వేయండి
# బాటా వేఫైండర్స్‌తో

జంతుపాదాల అడుగుల్ని గుర్తించడానికి సహకరిస్తుంది.

భారత్ స్కౌట్స్ అండ్ గైడ్స్ ఆమోదించింది. యీ ఒక్క జోడునే,
జంతు పాదల గుర్తులు కలిగి
లోపల దిక్సూచి
ఉన్న జోడు.









యూనిఫారమ్‌కు తగినట్లు తొడుక్కోనేందుకు ప్రత్యేకంగా తయారు చేయబడినవి బాటా వేఫైండర్స్ పైభాగం మృదువైన చర్మంతో. అడుగు భాగం దృఢమైన సోలుతో. మీకు సరిపోయే సైజు ఎంచుకోండి. ఈ రోజునే ఓ జత వేఫైండర్స్ కొనుక్కోండి. జూనియర్ మరియు సీనియర్: సైజులు రూ. 21.95—24.95

**బడి పిల్లలకు సరైన జోడు Bata**

కళాకారులారా... విద్యార్థులారా...
మీ ఊహలకు రూపకల్పన చెయ్యండి...



...పాతకాలంలోని బాలకులను, చిత్రకారులలోని అధ్యాపకులను, ఉదయులనూ కూడా
...సర్వస్వం మనోఫలకముపై రేఖాచిత్ర రూపములో మాత్రమే ఉన్న సమయం, వర్ణములు ఇంకనూ భావనా పటముపై అవ్యక్త రూపములో మాత్రమే ఉన్న సమయం, అదే మా భావనా సృష్టికి అనుగుణ్యమైన విభ్రమ జనకమైన వర్ణశ్రేణితో మేము సాక్షాత్కరింపు సమయం.

**షాలిమార్**

స్టూడెంట్స్ ఆయిల్ అండ్ వాటర్ కలర్స్
ఆర్టిస్ట్స్ ఆయిల్, వాటర్ అండ్ పోస్టర్ కలర్స్




షాలిమార్ స్టూడెంట్స్ ఆయిల్ అండ్ వాటర్ కలర్స్
షాలిమార్ ఆర్టిస్ట్స్ ఆయిల్, వాటర్ అండ్ పోస్టర్ కలర్స్
68 సంవత్సరాల అనుభవము అందిన గలవి

**షాలిమార్ పెయింట్స్ లి.**

కోర్టాల్డ్స్ (యు. కె.) గ్రూపుకు చెందిన కంపెనీలలో సభ్యులు

విక్రయ ప్రతినిధులు: అద్వానీ ప్రైవేట్ లి. కలకత్తా-1, ఎమ్. జి. షహాని అండ్ కం., (ఢిల్లీ) ప్రై. లి., క్రొత్త ఢిల్లీ-1, క్యాంప్-షహాని కార్పొరేషన్ బొంబాయి-1

heros-SPL-4 TL

ఎల్లప్రాయంలోనే పాపలకు నేర్పండి



# నియమానుసారం ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతో పళ్లు తోముకొన్నట్లైన ఇగుళ్ల బాధలను, దంతక్షయాన్ని అరికట్టుతుంది.




ఫోర్‌హాన్స్ పళ్లనూ, ఇగుళ్లనూ కూడా సంరక్షిస్తుంది. ఇది దంతవైద్యునిచే సృష్టింపబడినది. ఇందులో ఇగుళ్ల రక్షణకై ప్రత్యేకమైన యాస్ట్రింజెంట్స్ ఉన్నవి. నియమానుసారం రాత్రి, ప్రొద్దున ఫోర్‌హాన్స్‌తో పళ్లు తోముకొనుటవల్ల ఇగుళ్ల బాధలూ దంతక్షయమూ దగ్గరకు రావు. మీ బిడ్డకు ఈ ముఖ్య విషయం అలవాటు చేయటానికి వెంటనే ప్రారంభించండి. క్రొత్త విషయాలని నేర్చుకోవాలనే ఉత్సుకత ఉన్నప్పుడే నేర్పాలి. కనుక వెంటనే ప్రారంభించండి.

**ఫోర్‌హాన్స్ దంతసంరక్షణ గురించి ఎంత చిన్న వయసులో నేర్పితే అంత ఉత్తమం.**

**ఫోర్‌హాన్స్**
దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్ పేస్టు

**ఉచితము** "దంతములు, ఇగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అను వివరణాత్మకమైన చిన్న రంగుల పుస్తకము. ఇది మానర్స్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టు బాక్సు నం. 10031, బొంబాయి-1 (BR) వారి వద్ద దొరకును.

పేరు ____________________ వయస్సు ________

చిరునామా ____________________



దయచేసి పోస్టు ఖర్చులకై 15 పైసల తపాలా బిళ్లలను పంపండి. మీకు కావలసిన భాషను సూచిస్తూ దాని క్రింద గీతగీయండి. ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, తమిళ్, తెలుగు, మలయాళం, కన్నడం.

TBF-172 TEL

'C. 1'



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["మంత్రి కొడుకు"]కు ఆధారం కొండిశెట్టి ఉమాదేవి పంపిన కథ. స్నేహం చాలా విలువ గలది. కాని దానికి సమత్వం అవసరం: అసమానతలవల్ల స్వార్థాలలో తేడా వస్తుంది. స్నేహం దెబ్బతింటుంది. అందుచేత స్నేహాన్ని ప్రధానంగా ఎంచే వాళ్ళు సమానతను కూడా పాటించాలి. ఇదే ఈ కథలోని నీతి.

"చదువు రానివాళ్ళు" అన్న కథలో నిరక్షరులకు న్యాయం చెయ్యటం ఎంత కష్టమో తెలుస్తుంది.

సంపుటి 47 .ఆగస్టు '70 సంచిక 2



CHITRA




క్షీరోదధేశ్చ గాంభీర్యం జానాతి మథనా ద్ధరిః;
లేహనాయ తటం ప్రాప్తః కథం విద్యా ద్బిడాలకః ? 1

[పాలసముద్రం లోతు దాన్ని మథించిన విష్ణువుకు తెలుస్తుంది; పాలు తాగిన పిల్లి కేం తెలుస్తుంది?]

న భవతి, న చిరం భవతి, చిరంచేత్ఫలే విసంవాదీ,
కోప స్సత్పురుషాణాం తుల్య స్స్నేహేన నీచానాం. 2

[దుర్జనుడికి మైత్రిలాగే, సత్పురుషుడికి కోపం రాదు. వచ్చినా ఎక్కువ కాలం ఉండదు. ఉండినా పర్యవసానంలో లేకుండా పోతుంది.]

రాజన్, దుధుక్షసి యది క్షితి ధేను మేతాం
తేనాద్య వత్స మివ లోక మముం పుషాణ,
తస్మింశ్చ సమ్య గనిశం పరిపుష్యమాణే
నానాఫలం ఫలతి కల్పలతేవ భూమిః. 3

[ఓ రాజా, భూమి అనే గోవును నీవు పితుకదలచినట్లయితే దూడను పోషించినట్టుగా ప్రజలను పోషించు. ప్రజలను బాగా పోషించావంటే భూమి కల్పవృక్షం లాగా అనేక రకాల ఫలాల నిస్తుంది.]

వివేకం



# చదువురాని వాళ్ళు

పూర్వం ఒక జమీందారీ గ్రామంలో ఒక పేద రైతు ఉండేవాడు. అతనికి గల ఆస్తి ఒక ముసలి ఆవు. అది పొలాల కంచెల వెంబడ గడ్డిమేసి పొట్టపోసుకుంటూ ఉండేది.

ఆ ఆవు ఒకసారి జమీందారు పొలం పక్కన మేస్తూ ఉండగా పొలంలో మంచి, నవనవలాడే మొక్కలు కనిపించాయి. ఆ మొక్కలను తినాలన్న కోరిక ఆవుకు బలంగా కలిగింది. కంచె కొద్దిగా పడిపోయి ఉన్నచోట అది దూరి, పొలంలో ప్రవేశించింది. అది చూసి, జమీందారుగారి మనిషి దుడ్డుకర్ర పెట్టి ఒక్కదెబ్బ వేశాడు. ఆ ఒక్క దెబ్బకే ఆ ముసలి ఆవు చచ్చి ఊరుకున్నది.

తమకున్న ఒక్క ఆవూ పోయినందుకు రైతూ, అతని భార్యా చాలా విచారించారు. రైతు జమీందారు వద్దకు వెళ్ళి, తన ఆవును చంపినందుకు పరిహారం ఇవ్వమని కోరాడు. "నీకు పరిహారం కావాలా?" అంటూ జమీందారు తన నౌకర్ల చేత రైతును పది కొరడాదెబ్బలు కొట్టించాడు.

రైతు తన ఇంటికి తిరిగివచ్చి, జరిగినదంతా భార్యకు చెప్పాడు.

"జమీందారుగారు మనకు అన్యాయం చేస్తుంటే, రాజుగారి దగ్గిర ఫిర్యాదు చెయ్యటం తప్ప మనకు మరోమార్గం లేదు. రాజుగారు ధర్మాత్ముడు. అక్కడికి వెళితే, మన కాయన తప్పక న్యాయం చేస్తాడు," అన్నది రైతు భార్య.

కాని ఫిర్యాదు తయారుచేసే దెట్లా? వాళ్ళిద్దరూ చదువురానివాళ్ళు. అందుచేత వాళ్ళొక చెక్కపలక తయారుచేశారు. దాని మీద తమ గుడిసెబొమ్మా, జమీందారుగారి భవంతీ, జమీందారు చేనూ, దాని కంచే, అందులో శిథిలమైన భాగమూ, జమీందారు

నౌకరు కొడితే ఆవు పడిపోయి ప్రాణాలు వదిలిన చోటూ బొగ్గుతో గీశారు. జమీం దారు తనను కొట్టించిన పది కొరడాదెబ్బ లకూ పది గీతలు కూడా చేర్చాడు రైతు. ఫిర్యాదులో వివరాలన్నీ చేరాయి.

రైతు ఆ కొయ్యపలకను తన వీపుకు కట్టుకుని రాజధానికి బయలుదేరాడు. పోగా, పోగా, ఒక అడవి వచ్చింది. ఆ అడవిలో రైతుకు ఒక వేటగాడు కనిపించి, "ఎక్క డికి ప్రయాణం?" అని అడిగాడు.

"రాజుగారిని చూసి ఒక ఫిర్యాదు అందించాలి. ఇదుగో, నా వీపుకు కట్టు కున్నది అదే," అన్నాడు రైతు.

"దేన్ని గురించి ఫిర్యాదు?" అన్నాడు వేటగాడు.

"ఏం చెప్పేది? నిక్షేపమంటి మా ఆవును చంపేశారు," అంటూ రైతు ఒక చోట చతికిలబడి, వేటగాణ్ణి కూడా కూర్చోబెట్టి, తన వీపు నుంచి కొయ్యపలక తీసి ఒక్కొక్కటీ చూపుతూ, జరిగినదంతా చెప్పి, పలకమీద గీసిన బొమ్మలన్నీ వేటగాడికి వివరించాడు.

అంతా విని ఆ వేటగాడు, "బాగుంది! ఈ ఫిర్యాదు రాజుగారికి చూపించావంటే నీకు తప్పక న్యాయం జరుగుతుంది." అంటూ తన దారిన తాను సాగిపోయాడు.



ఆ వేటగాడే రాజన్న సంగతి రైతుకు తెలియదు.

రైతు అడవి దాటి రాజధాని చేరాడు. రాజభవనం వద్ద అతను లోపలికి వెళ్ళటానికి అనుమతి లభించింది. ఒక పెద్ద నడవ దాట గానే విశాలమైన చావడి వచ్చింది. అందులో రాజుగారూ, పన్నెండు మంది మంత్రులూ కూర్చుని ఉన్నారు. రాజు ఇప్పుడు రాజ లాంఛనాలు ధరించి ఉండటంచేత రైతు అయనను గుర్తించ లేదు. అతను తన ఫిర్యాదు పలకను, దగ్గిరలో ఉన్న మంత్రికి చూపి, "ఈ ఫిర్యాదు చిత్తగించండి. విషయ మంతా అందులో ఉన్నది," అన్నాడు.

మంత్రి పలక కేసి చూసి, "ఇదేం ఫిర్యాదు? అంతా అయోమయంగా ఉన్నదే!" అంటూ, దాన్ని మరొక మంత్రికి అందించాడు. అందరు మంత్రులూ దాన్ని చూశారు. ఒక్కరికీ అదేమిటో తెలియలేదు.

"వీడెవడో వెర్రివాడు లాగున్నాడు! బయటికి గెంటండి," అన్నారు వాళ్ళు.

రాజు వాళ్ళను వారించి, ఆ పలకను తాను పుచ్చుకుని, రైతుతో, "ఇదే నా నీ గుడిసె?" అంటూ పలక మీద చూపాడు.

"అవును, స్వామీ!" అన్నాడు రైతు.

"ఇది జమీందారు భవంతి కాదూ?" అన్నాడు రాజు.



"అందుకు సందేహమేమిటి, స్వామీ?" అన్నాడు రైతు.

"ఈ పొలం కంచె పడిపోయింది ఇక్కడేగా?" అన్నాడు రాజు.

"సరిగా అక్కడే!" అన్నాడు రైతు.

"ఇందులో నుంచి నీ ఆవు పొలంలోకి జొరబడితే జమీందారు మనిషి కొట్టినప్పుడు, అది ఇక్కడ పడి చచ్చింది. అవునా?" అన్నాడు రాజు.

"అయ్యో, స్వామీ! ఎందుకడుగుతారు?" అన్నాడు రైతు దుఃఖంతో.

"తరవాత ఈ పది గీతలూ, జమీందారు నిన్ను కొట్టించిన కొరడా దెబ్బ లన్న మాటేగా?" అన్నాడు రాజు.

రైతుకు పరమానందమయింది. అతను రాజును చూసి, "స్వామీ, తెలివంటే మీదే తెలివి. వీళ్ళంతా దండగే! ఒక్కడికీ బుర్ర లేదు!" అన్నాడు. మంత్రు లందరూ విరగబడి నవ్వారు.

"సరే, నువు వెళ్ళి, నేను నీకు న్యాయం జరిగేటట్టు తీర్పిస్తానని నీ భార్యతో చెప్పు!" అన్నాడు రాజు. రైతు సెలవు పుచ్చుకుని తన గ్రామానికి తిరిగి వెళ్ళాడు. అతని వెనకనే రాజుగారి ఫర్మానా జమీందారుకు చేరింది.

జమీందారు స్వయంగా రైతు గుడిసెకు వచ్చి, జరిగినదానికి క్షమాపణ చెప్పుకుని రాజాజ్ఞ ప్రకారం రైతుకు ఒక ఇల్లు కట్టించి ఇచ్చి, ఒక గొడ్ల చావడీ, పశువుల దొడ్డీ, ఏడు పాడి ఆవులూ, అరవై ఎకరాల బంజరు భూమీ రాసి ఇచ్చి, తాను రైతుకు చేసిన అన్యాయానికి పరిహారం చెల్లించుకున్నాడు.

రైతూ, అతని భార్యా ఇప్పుడు చాలా సుఖంగా బతుకుతూ వచ్చారు. రాజుగారి ధర్మ బుద్ధిని రైతు తరచుగా మెచ్చుకుంటూ ఉండేవాడు. అలా మెచ్చుకున్నప్పుడల్లా అతను, "అంత తెలివిగలవాడు ఆ చదువు రానివాళ్ళనెందుకు జీతాలిచ్చి పెట్టుకున్నాడో!" అని ఆశ్చర్యపోతూండేవాడు.







# కుంకుమభరిణి

పూర్వం కుంతలదేశాన్ని చిత్రద్రవు డనే రాజు పాలించేవాడు. ఆయనకు ఒక్కతే కుమార్తె. ఆమె పేరు తారామతి.

తారామతి ఒక రోజు చంద్రవర్మ అనే భటుణ్ణి వెంట బెట్టుకుని పురవీధుల కుండా దేవీఆలయానికి బయలుదేరింది. ఒక చోట ఆమెకు మనుష్యులు గుమికూడి ఉండటం కనబడింది. ఆ జనం అక్కడ అలా ఎందుకు గుమికూడారో తెలుసుకురమ్మని ఆమె తన భటుణ్ణి పంపింది. అతడు తిరిగి వచ్చి, "ఎవరో జ్యోతిష్కుడు అందరికీ భవిష్యత్తు చెబుతున్నాడు," అన్నాడు.

"నన్ను ఎవరు వివాహమాడతారో అడిగి తెలుసుకు రా," అన్నది తారామతి.

"దేవీ, ఈ జ్యోతిష్కులు పొట్ట నింపు కోవటానికి ఏదో చెబుతారు. వాళ్ళ మాటలు ఎంత మాత్రమూ నమ్మదగినవి కావు," అన్నాడు చంద్రవర్మ.

"ఏమిటి నీ అధిక ప్రసంగం? నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. నా ఆజ్ఞ నిర్వర్తించటమే నీ విధి," అన్నది తారామతి కోపంగా.

చంద్రవర్మ జ్యోతిష్కుడి వద్దకు వెళ్ళి తిరిగి వచ్చి, "నేను ముందే చెప్పలేదా? ఆ జ్యోతిష్కుడు చెప్పేది ఎంత మాత్రమూ నిజం కాదు," అన్నాడు.

"అతగాడు చెప్పేది నిజమో, అబద్ధమో నేను చూసుకుంటాను. అతను ఏం చెప్పాడు?" అన్నది తారామతి.

"ఏం చెప్పమన్నారు? మీరు నన్నే పెళ్ళాడతారుట!" అన్నాడు చంద్రవర్మ.

ఈ మాట విని తారామతి, పట్టరాని కోపం వచ్చి, తన చేతిలోని పూలసజ్జలో ఉన్న కుంకుమభరిణి తీసి, బలంగా చంద్రవర్మ ముఖాని కేసి కొట్టి, "హీనుడా! నువ్వా నన్ను పెళ్ళాడేది? తక్షణం ఈ దేశం విడిచి వెళ్ళిపో," అని ముందుకు సాగిపోయింది.

మల్లెల సీతారాంరావు

చంద్రవర్మ నుదుట గాయమయింది. రక్తం కారుతున్నది. అతను తలపాగాతో రక్తం తుడుచుకుని, కింద పడి ఉన్న కుంకుమభరిణ తీసుకుని, తిన్నగా దేశం విడిచి వెళ్ళిపోయాడు.

కుంతలరాజ్యాన్ని విడిచిన చంద్రవర్మ అనేక రాజ్యాలు దాటి కొంత కాలానికి మాళవరాజ్యం చేరాడు. అతను అక్కడికి చేరే సమయానికి మాళవదేశపు రాజు చని పోయి ఉన్నాడు. కొత్త రాజును ఏర్పాటు చేసుకోవాలంటే, పట్టపు ఏనుగు తొండానికి పూల మాల ఇచ్చి, దాన్ని ఏనుగు ఎవరి మెడలో వేస్తే వారిని రాజుగా అభిషేకించటం ఆ దేశపు ఆచారం.

చంద్రవర్మ మాళవరాజధాని చేరుకున్న నాడే ఏనుగు ఊరేగింపు జరుగుతున్నది. అందరితోబాటు చంద్రవర్మ కూడా ఊరే గింపు చూస్తున్నాడు. ఏనుగు అతను నిల బడి ఉన్న వేపుగా వచ్చి, అతని మెడలోనే దండ వేసింది. పౌరులు అతన్ని తీసుకు పోయి, రాజుగా అభిషేకించారు.

చంద్రవర్మ తన పేరును చంద్ర సేనుడుగా మార్చుకున్నాడు. రాజోచిత విద్యలన్నీ నేర్చుకున్నాడు. మంత్రులు అతన్ని పెళ్ళి చేసుకోమన్నారు. అనేక దేశాల నుంచి రాజకుమార్తెల పటాలు వచ్చాయి. వాటిలో తారామతి పటం కూడా ఉన్నది. అతనికి గతం గుర్తుకు వచ్చి, తారామతిని పెళ్ళాడతానన్నాడు. తారామతి తండ్రి మాళవరాజుకు తన కుమార్తె నిచ్చి చెయ్యటానికి ఎగిరి గంతువేశాడు.

చంద్రసేనుడికీ, తారామతికీ వైభవంగా పెళ్ళి జరిగింది. తారామతి తన భర్త ముఖం కేసి చూసి, "ఈ మచ్చ ఏమిటి?" అని అడిగింది.

చంద్రసేనుడు కుంకుమభరిణ తీసి ఆమెకు చూపి, "నా పట్టపురాణి దీనితో కొట్టిన దెబ్బ తాలూకు మచ్చ!" అన్నాడు.





# శిథిలాలయం

## 32

[విషసర్పం నోట చిక్కిన శిథిలాలయ పూజారిని, శిఖిముఖివాళ్ళు కాపాడారు. వాళ్ళకు గోపురకలశం ఒకటి కనబడింది. శిఖిముఖి, తన అనుచరుల సాయంతో, దాని చుట్టూ వున్న రాళ్ళను తొలగించసాగాడు. ఆ సమయంలో పెద్ద పెద్ద త్రిశూలాలు ధరించిన నలుగురు అఘోరీలు ఏనుగుల మీద వచ్చి వాళ్ళను చుట్టుముట్టారు. తరవాత—]

తమను చుట్టుముట్టిన ఆ నలుగురు అఘోరీలే కాక, వాళ్ళకు సాయంగా మరి వంద మంది అఘోరీలు ఏనుగుల మీద వస్తున్నట్టు వినగానే విక్రమకేసరితోపాటు అందరూ భయకంపితు లయ్యారు. పోరాటం లేకుండా లొంగిపోవటం అవమానకరం; అట్లని అంత మంది శత్రువులను, యీ కొద్దిమంది అనుచరులతో ఎదిరించజూడటం ఆత్మ హత్యతో సమానమవుతుంది....

విక్రమకేసరి యిలా ఆలోచిస్తున్నంతలో శిఖిముఖి చిన్నగా అరిచి, ఎగిరి గంతేసి, "అజితా, వీరభద్రా! వృశ్చిక నాయకుణ్ణీ, నాంగ్‌సోమ్‌నూ వెనక్కు లాక్కురండి. ఏనుగుల మీద వున్న అఘోరీలతో వాళ్లిలా పోరాడగలరు!" అన్నాడు.

వెంటనే అజిత వీరభద్రులు ముందుకు పరిగెత్తి, నాంగ్‌సోమ్‌నూ, వృశ్చికనాయకుణ్ణీ భుజాలు పట్టుకుని నిలిపి, శిఖిముఖి





"ఆ మాట నిజమే! వీళ్ళ నాయకుడు ఘోరచిత్తుడు మనకు అభయహస్తం యిచ్చాడు. స్వయంగా యిదిగో, యీ రుద్రాక్షమాల నా చేతికి కట్టాడు." అంటూ శిఖిముఖి చేతి నున్న మాలను అందరూ చూసేందుకు వీలుగా పైకెత్తాడు.

ఆ సరికి విక్రమకేసరికి బ్రహ్మపుత్రా నదీలోయ లోని మహారణ్యాల్లో లోగడ తాము అఘోరీలను కలుసుకున్న సంఘటన గుర్తుకొచ్చింది. అతడు చిరునవ్వు నవ్వుతూ శిఖిముఖి కేసి తిరిగి, "శిఖీ! నువ్వన్నట్టు మనకు ఈ అఘోరీల నుంచి ఎలాంటి ప్రమాదం రాదు. పైగా వీళ్ళ పెంపుడు ఏనుగుల సాయంతో, యిక్కడ వున్న రాళ్ళగుట్టలను తొలగించి, త్వరగా శిథిలాలయాన్ని బయటికి లాగవచ్చు." అన్నాడు.

"నేనూ అదే అనుకుంటున్నాను. కాని, ఒక సంగతి. వీళ్ళు ఆ ఘోరచిత్తుడి శిష్యులు కాకపోతే చిక్కుల్లో పడతాం. ఆ సంగతి తెలుసుకోవడం ఎలా?" అన్నాడు శిఖిముఖి.

"వీళ్ళు మహాకాలుడి భక్తులు. ఆ కాలుణ్ణి పూజించే వారికి మాత్రం హాని చేయరు," అన్నాడు కుంటి జాంగ్‌లా.

ఆజ్ఞ ఏమిటో వాళ్ళకు చెప్పారు. వాళ్ళిద్దరూ కోపంగా తమ చేతిలోని ఆయుధాలను అఘోరీల కేసి చూపి, అయిష్టంగా వెను దిరిగి శిఖిముఖి వున్న చోటుకు వచ్చారు.

శిఖిముఖి, రాళ్ళు లాగుతున్న తనవాళ్ళ నందర్నీ పనులు ఆపమని ఆజ్ఞాపించి, "ఈ అఘోరీల వల్ల మన కెలాంటి హానీ కలగదు. గోల్‌భరా గ్రామానికి వచ్చే దారి లోని అరణ్యాల్లో మనం వీళ్ళందర్నీ ఒకసారి కలుసుకున్నాం గదా!" అన్నాడు.

"అవును, కలుసుకున్నాం, దొరా! వీళ్ళు మహా క్రూరులు, నరభక్షకులు!" అన్నాడు కుంటి జాంగ్‌లా.







"ఆ మాట నిజం, శిఖిదొరా!" అన్నాడు నాంగ్‌సోమ్.

"వృశ్చికమాతను మించిన దైవం లేదు. ఎవరా మహాకాలుడు? మా వృశ్చికజాతి వాళ్ళం చావనైనా చస్తాంగాని, ఈ అఘోరీల దేవుణ్ణి ఒప్పం!" అంటూ వృశ్చిక నాయకుడు రాతిగొడ్డలి ఎత్తి, తన జాతి వాళ్ళందర్నీ తన దగ్గరకు రమ్మని హెచ్చరించాడు.

వృశ్చిక నాయకుడి మూర్ఖత్వం, మొండితనం బాగా ఎరిగిన శిఖిముఖి, అనవసర రక్తపాతం జరగబోతున్నదని గ్రహించి, అతడితో శాంతంగా, "వృశ్చికనాయకా! ఈ అఘోరీల విషయంలో నువ్వేమీ ప్రమేయం పెట్టుకోనవసరం లేదు. నువ్వలా చూస్తూవుండు." అని చెప్పి, రుద్రాక్షమాల వున్న చేతిని పైకెత్తి "ఘోరచిత్తుడికీ, జై! జై, మహాకాళా!" అంటూ పెద్దగా కేక పెట్టాడు.

ఆ కేక వింటూనే ఏనుగులపై నున్న నలుగురు అఘోరీలూ త్రిశూలాలను దించి, "జై, మహాకాళా!" అని అరిచారు. తరవాత శిఖిముఖీ వాళ్ళను సమీపించారు. వాళ్ళల్లో ఒకడు శిఖిముఖి కేసీ, విక్రమకేసరి కేసీ అనుమానంగా చూస్తూ, "ఇందులో ఏమీ మోసం లేదుకదా? మీ నాయకుడు పూజారి మహాజిత్తులమారి అని విన్నాం. వాడెక్కడ? మా గురువుగారైన ఘోరచిత్తుడి పేరు మీ కెవరు చెప్పారు?" అని అడిగాడు.

శిఖిముఖి, అఘోరీలకు నమస్కరించి, "మేము శిథిలాలయపూజారి అనుచరులం కాము. వాడు మాకు ప్రబల విరోధి. ఘోరచిత్తుడు స్వయంగా నా చేతికి కట్టిన రుద్రాక్షమాల యిదిగో!" అంటూ చేతిన వున్న మాలను చూపాడు.

అఘోరీలు ఆశ్చర్యపోతూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. వాళ్ళల్లో ఒకడు





నాలుగైదు నిమిషాలు గడిచీ గడవక ముందే, పర్వతాకారంలో వున్న ఒక ఏనుగు మీద వృద్ధు డొకడు మిట్ట వెనక వున్న పల్లంలో నుంచి మిట్ట మీదికి వచ్చాడు. అతడి వెనకగా మరి కొందరు అఘోరీలూ, ఇభ్యజాతివాళ్ళూ కాలినడకన ఏనుగు వెనగ్గా కదిలి వచ్చారు.

అంత దూరంలో వుండే, ఏనుగు మీద వున్న వృద్ధుణ్ణి గుర్తించిన శిఖిముఖి, సంతోషంగా ఒక కేక పెట్టి, "ఘోరచిత్తుడికీ, జై!" అన్నాడు.

ఘోరచిత్తుడు తాపీగా ఏనుగును నడుపుకుంటూ శిఖిముఖీ వాళ్ళున్న చోటుకు వచ్చి, అందర్నీ ఓసారి కలయజూసి, మౌనంగా ఏనుగు మీంచి దిగి, శిఖిముఖిని గట్టిగా కౌగలించుకున్నాడు. ఆ దృశ్యం చూస్తూనే విక్రమకేసరికి తమ కష్టాలన్నీ తొలగిపోయినవనీ, వచ్చిన పని విజయవంతంగా నెరవేరబోతున్నదనీ, గట్టి నమ్మకం కలిగింది. అతడు ఉత్సాహంగా, "ఘోరచిత్తుడికీ, జై!" అన్నాడు. అతడి అనుచరులంతా జై అంటూ ఏకకంఠంగా పలికారు.

ఘోరచిత్తుడు చిరునవ్వు నవ్వుతూ విక్రమకేసరిని సమీపించి, "కేసరీ! మీ తాత విక్రమకేసరి గురువు మాకు చేసిన

పక్కన వున్న వాడితో, "ఇది వింతగా లేదా? మనం శత్రువుల్ని వేటాడ వస్తే, వాళ్ళు మనకు మిత్రులం అని చెపుతున్నారు. ఆ రుద్రాక్షమాల సంగతి నమ్మదగిందేనా?" అన్నాడు.

ఆ ప్రశ్నకు రెండవ అఘోరీ అరచేత్తో నుదుటి మీద కొట్టుకుని, "ఈ అనుమానాలతో కాలయాపన జరిగిపోతున్నది. లాభంలేదు, మన గురువునే పిల్చుకు వస్తాను," అంటూ ఏనుగును దాపుల నున్న మిట్ట మీదికి దౌడు తీయించి, అక్కడ దాని మీద నిలబడి చేతులు ఊపుతూ పెద్దగా ఏవో కేకలు పెట్టసాగాడు.





ఉపకారానికి ప్రత్యుపకారం చేసే అవకాశం కలిగినందుకు చాలా ఆనందంగా వుంది. ఆయన చూడాలనుకున్న శిథిలాలయాన్ని మనవడివైన నువ్వు చూడగలిగావు. ఆ ఆలయ ప్రాంగణంలో వున్న అపురూప శిల్పాలూ, నిధులూ అన్నీ నీవే. ఇదుగో, భద్రకాళి పైన ఎక్కి చూడు! ఆ సంపదనంతా మోసుకు పోయేందుకు మరి కొందరు ఇభ్యుజాతివాళ్ళు కూడా వస్తున్నారు," అంటూ విక్రమకేసరిని సునాయాసంగా ఏనుగు పైకి ఎత్తాడు.

ఏనుగు పై నుంచి విక్రమకేసరి పరిసర ప్రాంతాలను ఓసారి కలయచూశాడు. ఎత్తుగా వున్న గుట్ట వెనక భాగాన్నుంచి కొందరు ఇభ్యుజాతివాళ్లూ, అఘోరీలూ తమ కేసి రావటం అతడి కంటబడింది. ఇంతమంది ఇభ్యుజాతివాళ్ళను ఘోరచిత్తుడు ఎలా కూడగట్టుకున్నాడో అతడికి అర్థంకాలేదు.

కేసరి ఏనుగు మీంచి దిగి ఘోరచిత్తుడికి తన కృతజ్ఞత తెల్పుకుని, శిఖిముఖికీ, నాంగ్ సోమ్‌కూ తాను చూసిన ఇభ్యుజాతి వాళ్ళను గురించి చెప్పాడు. శిఖిముఖిక్కూడా ఆశ్చర్యం కలిగి, అతడు ఘోరచిత్తుణ్ణి ప్రశ్నించాడు.

"అంతా ఆ మహాకాలుడి దయ!" అంటూ ఘోరచిత్తుడు ఆకాశం కేసి చేతులెత్తి నమస్కరించి, "మహారణ్యంలో మిమ్మల్ని కలుసుకున్న తరవాత, శిథిలాలయ పూజారిని గురించి మరి కొన్ని వివరాలు తెలుసుకోవటమే గాక ఈ లంకలోని శిథిలాలయం సంగతి ఒక ఇభ్యు వృద్ధుడి ద్వారా వివరంగా విన్నాను. ఆ పూజారి దుర్మార్గుడూ, మీరూ ఇక్కడికే బయలుదేరారని తెలిసి, వాణ్ణించి మీకు ప్రమాదం రాకుండా చూసేందుకు నేనూ మరొక పడవలో నా శిష్యులతో ప్రయాణం కట్టాను. దారిలో మీ పడవ వెనక కొంచెం ఆల

శ్యంగా బయలుదేరి దారితప్పిన, గోల్‌ఖరా ఇభ్యుల పడవ తటస్థపడింది. అందరం కలిసి యీ వృశ్చికలంక చేరాం," అన్నాడు.

"మీ సహాయానికి ఎంతో కృతజ్ఞులం. ఇక్కడ వున్నది నిజంగా తాతకేసరి చూడా లనుకున్న శిథిలాలయం అయివుంటే, మనం త్వరత్వరగా దీన్ని కప్పిన రాళ్ళగుట్టలను తొలగించాలి," అన్నాడు శిఖిముఖి.

"అదెంతపని! నా వెంట మరికొన్ని మచ్చిక చేసిన ఏనుగులు వున్నయ్. వాటి చేత పనిచేయించటంలో సమర్థులైన ఇభ్యజాతివాళ్ళు కొందరున్నారు," అన్నాడు, ఘోరచిత్తుడు.

ఇంతలో ఘోరచిత్తుడి వెంట పడవలో వచ్చిన ఇభ్యజాతివాళ్లంతా బిలబిలమంటూ అక్కడికి వచ్చారు. వాళ్లు తమ గ్రామం వాడైయిన నాంగ్‌సోమ్‌నూ, శిఖిముఖీ, విక్రమకేసరులనూ గుర్తించారు. అందరూ వాళ్ళ చుట్టూచేరి ఆనందం పట్టలేక నాట్యం చేయసాగారు.

ఈ కోలాహలం మధ్య నుంచి ఘోర చిత్తుడు శిఖిముఖినీ, విక్రమకేసరినీ దూరంగా తీసుకుపోయి, "ఇంతకూ ఆ శిథిలాలయ పూజారినని చెప్పుకునే దుష్టుడు ఏమయ్యాడు? ఈ లంకలో వాడి శిష్యుల్ని



ముగ్గురిని పట్టుకున్నాం. వాళ్ళు మా దగ్గరే బందీలుగా వున్నారు. తమ గురువు ఏమైందీ తెలియదంటున్నారు," అన్నాడు.

"ఇంతవరకూ మీకు ఆ పూజారిని గురించి చెప్ప మరిచాం. మీరు పట్టుకున్న ఆ ముగ్గురూ వాడి శిష్యులు కాదు, బంట్లు. మా ప్రాంతాల్లోని తిమ్మగూడెం అరణ్యా లలో వాళ్ళు దారిదొంగలు. డబ్బాశ చూపి ఆ దుర్మార్గుడు వాళ్ళను యింత దూరం తీసుకు వచ్చాడు. ఇక వాడు ఏమయా డంటారా? చావుబతుకుల్లో వున్నాడు." అంటూ శిఖిముఖి, ఘోరచిత్తుణ్ణి చెట్ల కేసి తీసుకుపోయి, కొమ్మలకు కట్టిన ఉయ్యా

లలో కూర్చుని వున్న శిథిలాలయ పూజారిని చూపించాడు.

పూజారి కళ్లు తెరిచేవున్నవి. కాని, మనిషిలో చలనం లేదు. పాము నోటి నుంచి బయటపడినప్పటికీ, అప్పుడు తగిలిన గాయాలు మాననందువల్ల అతడు ప్రాణాపాయ స్థితిలో వున్నాడు.

శిఖిముఖి కొద్ది మాటల్లో తాము వృశ్చిక లంకలో దిగిన క్షణాన్నుంచీ జరిగినదంతా ఘోరచిత్తుడికి చెప్పి, "ఆ విషసర్పం నుంచి నేను కాపాడకపోతే, యీ సరికి దాని పొట్టలో జీర్ణమై పోయివుండేవాడు, పూజారి," అన్నాడు.

ఆ మరుక్షణానే పూజారిలో చలనం కనబడింది. అతడు చేతులు రెండూ ఎత్తి ఘోరచిత్తుడికి నమస్కరిస్తూ, "నువ్వు మహాకాలుడి భక్తుడివి, నేను శిథిలేశ్వరి పూజారిని. ఆ విధంగా ఇద్దరం ఒకేరకం భక్తులం. నేను మరి ఎంతో కాలం బతకను. రాళ్ళతో కప్పబడిన శిథిలేశ్వరిని త్వరగా వెలికి తీయించు. చూసి, ప్రాణాలు విడుస్తాను," అన్నాడు. ఈ మాటలు అంటూండగానే అతడి కళ్ళ నుంచి నీళ్ళు ఏకధారగా ప్రవహించసాగినై.

ఘోరచిత్తుడు నాలుగైదు క్షణాలపాటు కన్నార్పకుండా శిథిలాలయ పూజారి ముఖం కేసి చూసి, ఒక్కసారిగా నిలువెల్లా కంపించిపోయి, బొంగురుపోయిన గొంతుతో, "ఇతడు ఎంత దుర్మార్గుడైనా మహాభక్తుడు! సందేహం లేదు!" అంటూ వెనుదిరిగి, తన శిష్యులతో, "ఏనుగుల్ని తోలుకు వచ్చి ఆలయాన్ని కప్పిన రాళ్ళను త్వరగా ఎత్తించివేయండి!" అని చెప్పాడు.

గురువు ఆజ్ఞ వింటూనే అఘోరీలూ, వాళ్ళ వెంట వచ్చిన ఇభ్యులూ ఏనుగుల మీద ఎక్కి వాటిని ఆలయం కేసి పరిగెత్తించుకు రాసాగారు.

—(ముగింపు వచ్చేసంచికలో)





# మంత్రి కొడుకు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఏ మిత్రుడి కొరకైనా ఇలా శ్రమపడుతున్న పక్షంలో కొంచెం హెచ్చరికగా ఉండు. ఏమంటే, మనుషుల స్వార్థానికి మైత్రి అడ్డం రాదు. ఇందుకు నిదర్శనంగా నీకు మహేంద్ర మహారాజు కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

మహేంద్రుడనే రాజు మహంతీపురాన్ని పరిపాలించేవాడు, ఆయన మంత్రి వీరభూపతి. వారిద్దరూ కేవలమూ రాజూ మంత్రీ లాగా కాక, ఆప్తమిత్రుల లాగా ఉంటూ, ఒకరికొకరు అండగా ఉంటూండేవారు.

కొంతకాలంపాటు ఇద్దరికీ సంతానం కలగలేదు. ఇంతలో ఒకనాడు రాజుకు ఒక కల

## బేతాళ కథలు



వచ్చింది.. ఆ కలలో ఎవరో ముని కనిపించి, "నీ నగరానికి దక్షిణంగా ఉన్న అరణ్యంలో సంతాన వృక్షం ఉన్నది. నువు స్వయంగా వెళ్ళి, దాని పండు తెచ్చి నీ భార్య కిచ్చి నట్టయితే ఆమెకు కొడుకు పుడతాడు," అని చెప్పి మాయమయాడు.

రాజు వెంటనే నిద్ర లేచి, తిరిగి నిద్ర పోలేకపోయాడు. ఈ కలలో ఆయనకు చాలా గురి కుదిరింది. తెల్లవారుతూనే ఆయన కాలకృత్యాలు తీర్చుకుని, దక్షిణాన ఉన్న అరణ్యానికి వెళ్ళాడు. అక్కడ ఒక చెట్టు కింద ఒక విగ్రహం కనిపించింది. కలలో తనకు కనిపించిన మునిని పోలి ఉన్నది ఆ విగ్రహం. ఆ చెట్టున రెండే రెండు పళ్ళున్నాయి.

వాటిని చూడగానే రాజుకు, తనకు ఇద్దరు కొడుకులు కలిగితే బాగుండు ననిపించింది. కాని అంతలోనే, మంత్రికి కూడా పిల్లలు లేరన్నది గుర్తుకు వచ్చింది.

"నాకు ఇద్దరు కొడుకులు కలిగితే వాళ్లు రాజ్యం కోసం కీచులాడుకోవచ్చు. అంతకన్న నాతోపాటే మంత్రికి కూడా ఒక కొడుకుంటే వాళ్ళిద్దరూ, మాలాగే రాజూ, మంత్రీగా ఉండి చక్కగా రాజ్యపాలన చేస్తారు," అనుకున్నాడు రాజు.

ఆయన చెట్టున ఉన్న రెండు పళ్ళూ కోసి తెచ్చి, ఒకటి తన భార్య కిచ్చి, రెండవది మంత్రి కిచ్చి అతని భార్య కివ్వమన్నాడు. రాజు భార్యా, మంత్రి భార్యా గర్భవతులై, ఒకే సమయానికి ఇద్దరు కొడుకులను కన్నారు. రాజు కొడుక్కు విజయుడు అనీ, మంత్రి కొడుక్కు విమలుడు అనీ పేర్లు పెట్టారు.

ఆస్థాన జ్యోతిష్కుడు మంత్రితో రహస్యంగా, "నీ కొడుకు రాజ్యం ఏలుతాడు. కుర్రవాడి జాతకం చాలా గొప్పది," అన్నాడు. కాని మంత్రి ఆ మాటలు ఏ మాత్రమూ నమ్మలేదు.

విద్య నేర్చుకునే వయసు రాగానే కుమారు లిద్దరినీ ఒకే గురువు వద్ద పెట్టారు. విద్యాభ్యాసంలో ఇద్దరూ గట్టివాళ్ళే అయినా, రాజు కొడుకైన విజయుడి కన్న మంత్రి కొడుకైన విమలుడు ప్రతి విద్యలోనూ ఎక్కువగా రాణిస్తూ వచ్చాడు. అది చూసి విజయుడు ఈర్ష్య పడక, విమలుణ్ణి చూసి మరింత గర్వపడేవాడు. రాజుకూ, మంత్రికీ ఎలాటి స్నేహభావం ఉన్నదో, వారి బిడ్డల మధ్య కూడా అలాటి స్నేహభావమే ఉన్నది.



వారి విద్యాభ్యాసం పూర్తి కావస్తూ ఉండగా, రాజు చనిపోతూ, రాజ్య భారాన్ని మంత్రికి అప్పగించాడు. విద్యలు పూర్తి చేసి కుమారు లిద్దరూ తిరిగి వచ్చారు. విజయుడి కింకా యుక్తవయసు రాలేదు. అందుచేత మంత్రి, కుమారుల నిద్దరినీ ఒక ఏడాదిపాటు దేశ సంచారం చేసి రమ్మనీ, అటు తరవాత విజయుడికి రాజ్యాభిషేకం చేస్తాననీ అన్నాడు.

అలా అన్నాడేగాని మంత్రి మనసులో ఉన్న ఆలోచన వేరు. విజయుడి కన్న తన కొడుకు అన్ని విధాలా సమర్థుడు. అదీకాక తన కొడుక్కు రాజ్యం ఏలే యోగం ఉన్న దని ఆస్థాన జ్యోతిష్కుడు ఏనాడో చెప్పాడు. విమలుడు తన కడుపున పుట్టిన కారణంగానే కద మంత్రి కాబోతున్నాడు? విజయుణ్ణి చంపించేస్తే, విమలుణ్ణి రాజును చేసే అధికారం తనకున్నది.

ఈ ఆలోచనతో మంత్రి విజయుణ్ణి హత్య చెయ్యటానికి ఇద్దరు భటులను నియమించాడు. విజయుడూ, విమలుడూ దేశ యాత్రకని బయలుదేరగానే, మంత్రి ఏర్పాటు చేసిన భటులు వారి వెనకగా బయలుదేరారు. ఏ క్షణంలో విజయుడు ఒంటరిగా దొరికినా వెంటనే అతన్ని చంపమని మంత్రి ఆ భటులకు చెప్పాడు.

వాళ్ళు పది రోజులపాటు విజయుణ్ణీ, విమలుణ్ణీ అతి రహస్యంగా అనుసరిస్తూ



వెళ్ళారు. తరవాత వాళ్ళు ఒక అరణ్యం ప్రవేశించారు. విజయుడు ఒక చెట్టు కింద కూర్చుని, దగ్గిరలో ఎక్కడన్నా నీరున్న దేమోనని విమలుణ్ణి చూడమన్నాడు.

విమలుడు చెట్ల చాటున కనుమరుగు కాగానే, మంత్రి పంపిన భటులలో ఒకడు కత్తి దూసి విజయుడి పైన పడ్డాడు. విజయుడు కత్తి తీసి ఆత్మరక్షణ చేసుకో సాగాడు. ఈ అలికిడి విని విమలుడు వెనక్కు తిరిగి వచ్చి, ఆ భటుణ్ణి అవలీలగా నిరాయుధుణ్ణి చేశాడు.

భటుడు విమలుడి కాళ్ళపైన పడి, తనను చంపవద్దనీ, తాను మంత్రిగారి ఆజ్ఞను పాలించటం తప్ప చేసిన నేరం ఏమీ లేదనీ అన్నాడు.

విమలుడికి తల తీసేసినట్టయింది. అతను విజయుడి మొహం చూడలేకపోయాడు. రాజకుమారుడు అతన్ని ఓదార్చుతూ, "నువ్వేమీ బాధ పడకు. గొప్పవాళ్ళకు కూడా ఒక్కొక్కసారి దుర్బుద్ధి కలుగుతుంది. ఇంతమాత్రాన మన స్నేహాని కేమీ మచ్చరాదు," అన్నాడు.

ఇక వాళ్ళు దేశపర్యటన మానుకుని, ఇంటికి ప్రయాణమయారు. ఈ లోపలనే, మంత్రి పంపిన రెండో భటుడు నగరం చేరి, మంత్రితో జరిగిన దంతా చెప్పాడు.

మంత్రి కంగారు పడి, రాజ్యం వదిలి పెట్టి పారిపోయే ప్రయత్నంలో ఉండగా విజయుడూ, విమలుడూ తిరిగి రానే వచ్చారు. మంత్రి ఏమీ ఎరగనట్టే రాజకుమారుడికి స్వాగతం చెప్పి, సాధ్యమైనంత త్వరలో అతని పట్టాభిషేకానికి ముహూర్తం పెట్టిస్తానన్నాడు.

"నాకు రాజ్యాభిషేకం చేసే ముందు రాజ్యాన్ని రెండు భాగాలు చేసి, ఒకదానికి నన్నూ, రెండోదానికి విమలుణ్ణీ రాజుగా అభిషేకించండి. ఇది నా కోరిక," అన్నాడు విజయుడు.

మంత్రి మారుచెప్పక, అతను కోరిన ప్రకారమే చేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం? తనను చంపించటానికి ప్రయత్నించిన మంత్రి మీద రాజకుమారుడెందుకు పగతీర్చుకోలేదు? అతను తన అర్ధరాజ్యాన్ని మంత్రి కొడుకుకు ఎందుకు ధారపోశాడు? మంత్రి తనను చంపటానికి మళ్ళీ ప్రయత్నిస్తాడనా? మంత్రి కొడుక్కు అర్ధరాజ్యం ఇచ్చినందువల్ల తనకు అలాటి ప్రమాదం తప్పుతుందా? ఈ అనుమానాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజకుమారుడు తనకూ మంత్రి కుమారుడికీ గల స్నేహాన్ని చాలా ముఖ్యంగా భావించాడన్నది స్పష్టం. మంత్రి రాజకుమారుణ్ణి చంపించాలని యత్నించినట్టు తెలియగానే మంత్రి కుమారుడు రాజకుమారుడి కేసి చూడలేకపోయాడు. అలాటప్పుడు మంత్రిని రాజద్రోహి అని చంపిస్తే, రాజకుమారుడికీ, మంత్రి కుమారుడికీ మధ్య ఉండిన స్నేహం దెబ్బతినక తప్పదు. పోతే, మైత్రికి సమాన హోదా తోడుగా ఉండాలన్నది కూడా రాజకుమారుడు తెలుసుకున్నాడు. తన తండ్రీ, మంత్రీ ఎంతో స్నేహంగా ఉండేవారు. కాని వారి మధ్య సమత్వం లేక పోయింది. ఒకరు రాజు, మరొకరు మంత్రి. రేపు రాజకుమారుడికీ, మంత్రి కుమారుడికీ మధ్య ఇలాటి అసమత్వమే ఏర్పడితే వారి మైత్రి శాశ్వతంగా నిలవదు. అది గ్రహించే రాజకుమారుడు, తన మిత్రుడైన మంత్రి కుమారుడికి అర్ధ రాజ్యం ఇచ్చి, తన స్నేహానికి బలమైన పునాది కలిగించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# వ్యర్థజీవితం

ఒకనాడు జగద్గురు శంకరాచార్యుల వద్దకు కాపాలికు డొకడు వచ్చి, "నీవు చాలా గొప్పవాడివని అందరూ అంటున్నారు. నాతో పోటీకి రాగలవా?" అని అడిగాడు.

"నీ ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించు," అన్నాడు శంకరాచార్యులు.

"నేను ఆకాశంలో సంచరించగలను," అంటూ కాపాలికుడు ఆకాశం లోకి ఎగిరిపోయి, చాలాసేపు అక్కడ తిరిగి, కిందికి దిగి వచ్చాడు.

"ఈ విద్య అభ్యసించటానికి నీ కెన్నాళ్ళు పట్టింది?" అని శంకరాచార్యులు కాపాలికుణ్ణి అడిగాడు.

"సుమారు నలభై సంవత్సరాలు కృషి చేశాను," అన్నాడు కాపాలికుడు.

"ఇందుకై అంత జీవితం వ్యర్థం చేశావా? ఏ సత్పురుషుణ్ణి దూషించినా, ఏ కాకి జన్మో ఎత్తి యావజ్జీవం ఆకాశంలో ఎగరగలిగేవాడివి గద!" అన్నాడు శంకరాచార్యులు.

కాపాలికుడు సిగ్గుపడిపోయాడు.

—"మల్లీప్రియ" నాగరాజు





# అనుకూలవతి

ఒక గ్రామంలో గోపన్న అనే రైతు ఉండే వాడు. అతనికి కొంత పొలం ఉండేది, రెండు ఆవులు వుండేవి.

ఒకసారి గోపన్న భార్య, "మనకు ఒక్క ఆవు చాలు. రెండోది కూడా దేనికి? దాన్ని సంతకు తీసుకుపోయి అమ్మెయ్యి. నిలవ ఉన్న నూరురూపాయలకు మరి కాసిని చేరుద్దాం," అన్నది.

గోపన్న ఆవును సంతకు తోలుకు పోయాడు. కాని అక్కడ దానికి బేరం తగలలేదు. గోపన్న సాయంకాలం దాకా చూసి, ఆవును ఇంటికి తోలుకురాసాగాడు.

దారిలో గోపన్నకు ఒక మనిషి గుర్రంతో ఎదురై, గోపన్న ఆవును అమ్మే ప్రయత్నంలో ఉన్నాడని తెలిసి, తన గుర్రాన్ని ఆవుకు మారకం వేసుకున్నాడు.

గోపన్న గుర్రాన్ని తీసుకు వస్తూండగా మరొక మనిషి మేకను తోలుకుంటూ వసున్నాడు. గోపన్న వాడికి గుర్రాన్నిచ్చి మేకను తీసుకున్నాడు. మరికొంత దూరం పోయాక గోపన్నకు బాతు గలవాడొకడు కనిపించాడు. వాడికి మేక నిచ్చి బాతును తీసుకున్నాడు గోపన్న. ఇంకా కొంత దూరం పోయి గోపన్న ఒక కోడిపుంజును తీసుకున్నాడు.

గోపన్నకు ఆకలి దహించుకుపోతున్నది. అందుచేత ఒక గ్రామంలో అతను కోడి పుంజును అమ్మి, ఆ డబ్బుతో పూటకూళ్ళ ఇంట భోజనం చేసి, చీకటి పడినాక తన గ్రామం చేరుకున్నాడు.

అతను తన ఇల్లు చేరబోతూండగా పొరుగున ఉండే రైతు రామన్న కనిపించి, "సంతలో ఆవును అమ్మబోయావటగా? ఎంతకు అమ్మావేం?" అని అడిగాడు.

"ఆవుకు గిరాకీ లేదు. గుర్రానికి ఆవును మారకం వేశాను," అన్నాడు గోపన్న.

బి. శ్యామలాదేవి

"గుర్ర మేదీ?" అన్నాడు రామన్న.

"దాన్ని మళ్ళీ మారకం వేసి మేకను తీసుకున్నాను," అంటూ గోపన్న జరిగిన దంతా రామన్నకు చెప్పాడు.

రామన్న అంతా విని ముక్కు మీద వేలు వేసుకుని, "అరెరే, ఎంత పని చేశావు, గోపన్నా? నిక్షేపం లాంటి ఆవును పిడికెడు మెతుకులకు అమ్మి, ఉత్తచేతులతో తిరిగి వచ్చావా? ఇవాళ నీ భార్య చేతిలో నీకు చివాట్లు తప్పవులే!" అన్నాడు.

"నా భార్య నేను ఏమి చేసినా అర్థం చేసుకుంటుంది," అన్నాడు గోపన్న.

"ఇవాళ నువు చేసిన పని మాత్రం నీ భార్య సహించదు. కావలిస్తే పందెం వెయ్యి!" అన్నాడు రామన్న.

"నా దగ్గర నూరురూపాయ లున్నాయి. అది పందెం కాస్తాను," అన్నాడు గోపన్న.

"నీ భార్య నిన్ను చివాట్లు పెట్టుతుం దని నేను నూరురూపాయలు పందెం వేస్తాను. పద మీ ఇంటికి!" అంటూ రామన్న గోపన్న వెంట వాళ్ళింటి దాకా నడిచాడు. గోపన్న లోపలికి వెళ్ళాడు.

"వెళ్ళిన పని ఏమయింది?" అన్నది గోపన్న భార్య.

"ఆవును ఎవరూ కొనలేదు. దాన్ని గుర్రానికి మారకం వేశా!" అన్నాడు గోపన్న.

"ఏనాడైనా ఆవు కన్న గుర్రం మెరుగే గద!" అన్నది భార్య.

"కొంత దూరం వెళ్ళాక గుర్రాన్నిచ్చి ఒక మేకను తీసుకున్నా. దాన్ని మార్చి బాతును తీసుకున్నా. బాతును మార్చి కోడిని తీసుకున్నా. దాన్ని అమ్మి ఆ డబ్బులు పెట్టి భోజనం చేశా!" అన్నాడు గోపన్న.

"చాలా మంచిపని చేశావు!" అన్నది గోపన్న భార్య.

సంభాషణ అయిపోయిందని గ్రహించి, పందెం ఓడిపోయిన రామన్న నూరురూపా యలు తెచ్చి గోపన్నకు ఇచ్చుకున్నాడు.





# సైనికుడి యుక్తి

హంగరీ సైనికులను హుజార్ లంటారు. వాళ్ళు ఒకసారి సైనికులుగా చేరారంటే పన్నెండేళ్ళపాటు విధిగా రాజుగారికి సేవచెయ్యాలి.

మాత్యాష్ అనేవాడు హంగరీకి రాజు అయాక అతను తన సైనికులు ఎప్పుడూ తప్ప తాగి ఉండటం గమనించాడు. హుజార్ సైనికుడికి వారం వారం ఇచ్చే జీతం నాలుగు కాసులు. అంత కొద్ది డబ్బుతో హుజార్లు అస్తమానమూ ఎలా తాగగలుగుతున్నారో ఆయనకు అర్థం కాలేదు. సైనికోద్యోగుల నడిగితే వాళ్ళేమీ చెప్పలేకపోయారు.

ఈ రహస్యాన్ని తానే స్వయంగా తెలుసుకోవాలనుకుని రాజు హుజార్ దుస్తులు ధరించి, జేబులో నాలుగు కాసులు మాత్రమే వేసుకుని, సాధారణ సైనికుడి లాగా వినోదారం బయలుదేరాడు. ఆయన ఆ నాటి సాయంకాలానికి నగరం వెలపల ఉన్న ఒక సారా అంగడికి చేరాడు.

అంగడిద్వారం చేరుతూ ఉండగానే లోపలి నుంచి నవ్వులూ కేకలూ వినిపించాయి. తాను కూడా తన నాలుగు కాసులతో వినోదం పొందటానికి అది తగిన స్థలమే ననుకుని రాజు లోపలికి అడుగు పెట్టాడు.

లోపల నలుగురు పాత హుజార్లున్నారు. వారిలో ఒకడు కొత్త హుజారును చూస్తూనే అతని చెవి పట్టుకుని నిలవేసి, "ఏం, కుర్రకుంకా? సైన్యంలో ఎప్పుడు చేరావు?" అని అడిగాడు.

"ఒక వారం క్రితం," అన్నాడు రాజు.

పాత హుజారు రాజు భుజం తట్టి, "నీ కింకా పన్నెండేళ్ళపాటు కష్టాలున్నాయన్నమాట. దాన్ని గురించి ఆలోచించకు. రెండు కాసుల బ్రాందీ కొను. జల్సా చేద్దాం," అన్నాడు.

హంగరీ జానపద కథ




"నా దగ్గిర డబ్బుల్లేవు. మేం చాలా పేదవాళ్ళం," అన్నాడు రాజు.

"అయితే అయింది. నిన్ననే జీతం వచ్చి ఉండాలి. ఒక కాసు బ్రాందీ అయినా నాకు పోయించి తీరాలిసిందే, తప్పదు," అన్నాడు పాతహుజారు.

రాజుకు తప్ప లేదు. ఒకడికి బ్రాందీ పోయించేసరికి మిగిలిన ముగ్గురు పాత హుజార్లూ రాజు చేత తలా ఒక కాసు బ్రాందీ కొనిపించి తాగేశారు. రాజు జేబులు ఖాళీ అయాయి.

కాని అప్పటికీ వాళ్ళకు తాగుడు చాల లేదు. వాళ్ళలో యోష్కా అనేవాడు అంగడి వాడి దగ్గిరికి వెళ్ళి, "అప్పు పెట్టి ఒక కాసు బ్రాందీ ఇయ్యి," అని అడిగాడు.

సైనికులకు అప్పుపెట్టననేశాడు అంగడి వాడు, నిర్మొహమాటంగా.

యోష్కా వాణ్ణి నానాతిట్లూ తిట్టి, "కావలిస్తే నా కత్తి తాకట్టు పెట్టుకుని బ్రాందీ ఇయ్యి," అన్నాడు. అంగడి వాడా కత్తిని భద్రంగా దాచి పెట్టి, పాత హుజార్లందరికీ తలా కాస్తా బ్రాందీ పోసేసి, దుకాణం మూసే వేళ అయిందన్నాడు.

అప్పటికి రాత్రి తొమ్మిది కావస్తున్నది. హుజార్లు అంగడి నుంచి బయటికి వచ్చేశారు.

అంతటితో వారి ఆగడం అయిపోలేదు. ఆ సారా దుకాణం అడుగున ఒక నేల కొట్టులో ఆహారమూ, తాగుడూ దాచి ఉంటాయి. నేలలో ఒక కంత చేసి హుజార్లు కొంతకాలం కిందట ఆ నేల కొట్టును కొల్లగొట్టారు. ఇప్పుడు వాళ్ళా కంత కోసం వెతికి, అందులో రాజును దూరి ఆహారమూ, తాగుడూ తమకు అందించమని ఒత్తిడి చేశారు. రాజుకు తప్ప లేదు. వాళ్ళు చెప్పినట్టు చెయ్యకపోతే చంపేస్తారు. హుజార్లు సాహసానికీ, దుర్మార్గానికీ పెట్టినది పేరు.

నేలకొట్టు నుంచి తస్కరించిన తిండీ, తాగుడూ పూర్తి చేసి వాళ్ళు బారకాసులకు

బయలుదేరి వెళ్ళారు. బారకాసులకు వాళ్ళు వేళమించి చేరినా గస్తీ సైనికులు వాళ్ళను నిలవేయలేదు.

పాత హుజార్ల కందరికీ పడుకునే స్థలాలున్నాయి. రాజుకే లేదు. యోష్కా అనే వాడు నేల మీద ఒక కంబళి పరిచి, రాజును దాని మీద పడుకోమన్నాడు.

రాజుకు నిద్ర పట్టలేదు. అతనికి చాలా కోపంగా ఉంది. ఈ హుజార్లు తన డబ్బంతా తాగెయ్యటమే గాక తన చేత దొంగతనం కూడా చేయించారు, తనను నానాతిట్లూ తిట్టారు. యోష్కాకు గుణపాఠం నేర్పాలని అతను నిశ్చయించుకుని ఒక రాత్రి వేళ బారకాసుల నుంచి తన భవనానికి తిరిగి వెళ్ళిపోయాడు.

తెల్లవారుతూనే హుజార్లందరూ తమ ఆయుధాలతో సహా పెరేడుకు రావాలనీ, రాజుగారు తణిఖీ చేస్తారనీ వార్త వచ్చింది. హుజార్లందరూ తమ ఖడ్గాలను తగిలించుకుంటూంటే, యోష్కా తన కెవరైనా ఒక ఖడ్గం ఇస్తారేమో నని ఎందరినో అడిగి చూశాడు. కాని ఎక్కడా అతనికి ఖడ్గం దొరకలేదు. చివర కతను ఒక వడ్రంగి నడిగి కొయ్యకత్తి ఒకటి చేయించుకుని, దాన్ని ఒరలో పెట్టుకుని పెరేడుకు బయలుదేరాడు.



పెరేడుకు వచ్చి తన ఎదట నిలబడి ఉన్న హుజార్లలో యోష్కాను రాజు పోల్చుకుని, అతని వద్ద ఖడ్గం ఉన్నదో లేదో ముందుగా చూశాడు. యోష్కా నడుముకు కత్తిఒర వేళ్ళాడుతున్నది. అందులో కత్తి లేదన్న సంగతి బయటపెట్టి యోష్కాను శిక్షించాలని రాజు ఉద్దేశం.

ఏదో నేరం చేసినందుకు ఒక సైనికుడికి మరణదండన విధించి, ఖైదులో ఉంచారు. రాజు ఇప్పుడా సైనికుణ్ణి తన దగ్గరకు తీసుకురమ్మన్నాడు. మరణశిక్ష పొందిన సైనికుణ్ణి తెచ్చారు.

రాజు యోష్కాను ముందుకు రమ్మని, "వాడి తల నరుకు!" అని ఆజ్ఞాపించాడు.

యోష్కాకు కాళ్ళు వణికాయి. తన కొయ్యకత్తితో ఆ సైనికుడి తల ఎలా నరకటం? అందుచేత వాడు దీనంగా, "మహారాజా, రక్తపాతం చెయ్యటం నా కలవాటు లేదు. మరి నాలుగేళ్ళు నన్ను సైనికుడిగా పని చెయ్యమన్నా సంతోషంగా చేస్తాను గాని, ఈ మనిషి తల నరికే పని మాత్రం నాకు పెట్టకండి," అన్నాడు.

రాజు మండిపడి, "నా ఆజ్ఞ విన్నావా, లేదా?" అని గర్జించాడు.

"మహారాజా, తమ ఆజ్ఞ నిర్వర్తించే తీరాలంటే నన్ను కాస్త దైవప్రార్థన చేసుకో నివ్వండి," అన్నాడు యోష్కా.

రాజు ఇందుకు సమ్మతించాడు.

యోష్కా పెద్ద నిట్టూర్పు విడిచి, ఆకాశం కేసి చూస్తూ, "ఓ ఈశ్వరా! ఈ హుజారును కరుణించు. నే నీ సైనికుడి ప్రాణం తియ్యకుండా ఉండగలందులకు నా కత్తిని కొయ్యగా మార్చు!" అంటూ కత్తిని చప్పున ఒర నుంచి పైకి లాగి, "చూశారా, మహారాజా! దేవుడు నా ప్రార్థన విన్నాడు!" అన్నాడు.

రాజు యోష్కా యుక్తికి మెచ్చుకుని, అతన్ని శిక్షించే ఆలోచన మానేశాడు.





# ఉపాయశాలి

పూర్వం మగధను పాలించిన సోమదత్తుడికి కొడుకులు లేరు, చంద్రలేఖ అనే కుమార్తె మాత్రం ఉండేది. ఆమె చాలా అందగత్తె. ఈ సంగతి విని, పొరుగున ఉన్న కళింగ దేశపు రాజు శూరసేనుడు, చంద్రలేఖను తన కిచ్చి పెళ్ళిచెయ్యవలసిందిగా సోమదత్తుడికి వార్త పంపాడు.

శూరసేనుడు భోగలాలసుడూ, క్రూరుడూ, దుర్జనుడూనూ. అయితే అతను సోమదత్తుడికన్న బలవంతుడు. బలవంతుడితో విరోధం మంచిది కాదని ఎరిగి కూడా సోమదత్తుడు, తన కుమార్తె కింకా యుక్తవయసు రాలేదనీ, ఆమె వివాహం స్వయంవరం ద్వారా జరుగుతుందనీ ఏవేవో సాకులు చెప్పి, శూరసేనుడి కోరికను తోసిపుచ్చాడు.

ఇది శూరసేనుడికి తీరని అవమానమయింది. మగధరాజ్యాన్ని స్వాధీనం చేసుకోవా లన్న దుర్బుద్ధి కూడా అతడికి లేకపోలేదు. చంద్రలేఖను పెళ్ళాడితే రెండూ యుద్ధం లేకుండా కలిసి వస్తాయని అతను అనుకున్నాడు. చంద్రలేఖను పెళ్ళాడటం ద్వారా మగధ తనది అయే అవకాశం లేకుండా పోయింది గనక, యుద్ధం ద్వారా మగధను ముందు తనది చేసుకుని, అటు తరవాత చంద్రలేఖను పెళ్ళాడటానికి శూరసేనుడు నిశ్చయించుకున్నాడు.

శూరసేనుడు తన దేశం మీద యుద్ధ యత్నాలు చేస్తున్నాడని తెలిసి సోమదత్తుడు భయపడ్డాడు. అతను మంత్రులతో సంప్రతించగా వారు రకరకాలుగా సలహాలిచ్చారు. ఒకరు చంద్రలేఖ నిచ్చి శూరసేనుడికి పెళ్లిచేసి రాజ్యానికి యుద్ధప్రమాదాన్ని తొలగించుకోవటం మంచిదన్నారు. చంద్రలేఖను మరొక రాజకుమారుడికి వాగ్దానం చేసి, యుద్ధంలో సహాయం పొందటం మంచిదని మరొకరు అన్నారు. ఎంత ధనమైనా శూర

మల్లాది వెంకటకృష్ణమూర్తి



సేనుడికి లంచం పెట్టి యుద్ధం మాన్పించి సంధి చేసుకోవటం మేలని ఇంకొకరు సలహా యిచ్చారు.

ఎంతమంది ఎన్ని సలహాలు చెప్పినా సోమదత్తుడికి అవి ఆచరణీయంగా కని పించలేదు. యుద్ధం తప్పేటట్టు లేదు. యుద్ధం జరిగితే సర్వనాశనం తప్పదు.

రాజు ఈ భయంతో బాధపడుతూండగా ఒకనాడు ఒక యువకుడు ఆయన వద్దకు వచ్చి, "మహారాజా, మన మీదికి శత్రు వులు వస్తున్నారని విన్నాను. యుద్ధం జరగ కుండా శత్రువులను పంపేటందుకు ఒక ఆలోచన చేశాను. దయచేసి నాకు ఒక విల్లూ, ఒక వెయ్యి బాణాలూ ఇప్పించండి," అని అడిగాడు.

"ఎవరు నువు? విలుకాడివా? నువు ఒక్కడివే శత్రుసేనతో తలపడి యుద్ధం చేస్తావా?" అని రాజు అడిగాడు.

"నేను కట్టెలు కొట్టుకుని బతికేవాణ్ణి, మహారాజా. అరణ్యంలో చాలామంది విలు కాళ్ళను చూశాను గాని, నే నెన్నడూ విల్లు పట్టినవాణ్ణి కాను. నా ఆశయం శత్రువులను వెనక్కు తిప్పి పంపటమే!" అన్నాడా యువకుడు.

వాడు తనతో వేళాకోళం ఆడుతున్నాడని రాజుకు అనుమానం కలిగింది.

"యుద్ధం చెయ్యటానికి వచ్చిన సేనను తిప్పి పంపటం మాటలనుకున్నావా? నిన్ను క్రూరంగా శిక్షిస్తాను," అన్నా డాయన చాలా కోపంగా.

"నా ప్రయత్నం నెరవేరకపోతే శత్రు వులే నన్ను చంపేస్తారు, మహారాజా. నన్ను శిక్షించే శ్రమ మీ కుండదు. నేను తమర్ని కోరినది స్వల్పం. నాకు విల్లూ, బాణాలూ ఇప్పించండి. చాలు. నా ప్రయత్నం నేను చేస్తాను," అన్నాడు యువకుడు.

వాడి మాటలలో నిజాయితీ, ఆత్మవిశ్వా సమూ ఉన్నట్టు రాజుకు తోచింది. అందు

చేత ఆయన వాడికి విల్లూ, వెయ్యి బాణాలూ ఇప్పించాడు.

ఆ రోజే, శత్రువులు మగధ మీదికి వస్తున్న వార్త కూడా వచ్చింది.

కట్టెలుకొట్టే యువకుడు అరణ్యంలోకి వెళ్ళి చాలా ఎత్తుగా ఉన్న చెట్లకొమ్మలకు బాణాలు కొట్టి అవి గుచ్చుకున్న చోట బాణం చుట్టూ సుద్దతో వలయాలు గీశాడు. అడవిచెట్ల నిండా వాడి బాణాలే.

కళింగసేనలు అరణ్యం అవతల మైదానంలో దిగాయి. కళింగ సైనికులు యథేచ్ఛగా అడవిలో ప్రవేశించి తిరగసాగారు. వారికి చెట్లమీద గురి తగిలిన బాణాలు కనిపించాయి. విలుకాడు ఎవరో వాళ్ళకు తెలియదు గాని, వాడికి గల గురిమాత్రం అద్భుతంగా కనిపించింది.

చెట్లమీది బాణాలను చెట్టు చెట్టునా చూస్తూ ఒక కోనేరు వద్దకు వచ్చారు వాళ్ళు. దాని గట్టున ఒక యువకుడు కూర్చుని తిండి తింటున్నాడు. వాడి పక్కన ఒక విల్లూ, కొన్ని బాణాలూ ఉన్నాయి. ఆ బాణాలు చెట్ల మీద కనిపించిన బాణాల లాంటివే.

"నువ్వేనా ఇక్కడి చెట్ల మీద బాణాలు కొట్టినది?" అని శత్రు సైనికులు వాణ్ణి అడిగారు.



"అవును, నేనే కొట్టాను," అన్నాడు యువకుడు.

"మంచి గురి గలవాడివి లాగున్నావే?" అన్నారు వాళ్ళు.

"అభ్యాసం చేస్తున్నాను," అన్నాడు కట్టెలుకొట్టే యువకుడు. వాళ్ళు వాణ్ణి తమ సేనానాయకుడి దగ్గిరికి రమ్మన్నారు. వాడు అభ్యంతరం చెప్పలేదు.

శూరసేనుడూ, సేనానాయకుడూ ఒక గుడారంలో కూర్చుని మాట్లాడుకుంటూ ఉండగా కళింగ సైనికులు యువకుణ్ణి తీసుకువచ్చి, వాడికి గల గురిని తాము కళ్ళారా చూసిన సంగతి చెప్పారు.

"మా సైన్యాన్ని చూశావు గదా? మీ రాజు యుద్ధానికి సిద్ధం కావడంలేదా?" అని సేనానాయకుడు యువకుణ్ణి అడిగాడు.

"మా రాజుగారు యుద్ధానికి ఎప్పటి నుంచో సిద్ధంగా ఉన్నారు," అన్నాడు యువకుడు.

"అయితే మరి నువు సైన్యంలో ఉండక అడవిలో ఏం చేస్తున్నావు?" అని శూరసేనుడు అడిగాడు.

"నే నింకా విలువిద్య అభ్యసిస్తున్నాను, మహారాజా. నా వంటి వాణ్ణి సైన్యంలో చేర్చుకుంటారా? నన్ను మించిన విలుకాళ్ళు మా రాజుగారి కింద అయిదువేలమంది ఉన్నారు. సైన్యంలో చేరే అర్హత కోసం అడవిలో అభ్యాసం చేస్తున్నాను," అన్నాడు యువకుడు.

"మాతో యుద్ధం చేసి మీ రాజు గెలవ గలడంటావా?" అన్నాడు శూరసేనుడు ఆశ్చర్యంగా.

"ఆ ప్రశ్న నన్నడిగి ప్రయోజనం లేదు. యుద్ధం చేసి చూడండి, మీకే తెలుస్తుంది," అన్నాడు యువకుడు.

శూరసేను డా యువకుణ్ణి పంపేసి సేనానాయకుడితో చాలాసేపు చర్చించి, సేనలను వెనక్కు నడిపించుకు పోవటమే మంచిదని నిర్ణయించాడు.

కళింగసేనలు వచ్చినట్టే వచ్చి తిరిగి వెళ్ళిపోయాయని తెలిసి సోమదత్తుడు చాలా ఆశ్చర్యపోయాడు. ఆయన కట్టెలుకొట్టే యువకుణ్ణి పిలిపించి, "శత్రువులు యుద్ధం చెయ్యకుండా వెళ్ళిపోయారు. నువు ఏం చేశావేమిటి?" అని అడిగాడు.

యువకుడు తాను చేసిన దంతా చెప్పాడు. రాజు వాడి యుక్తికి మెచ్చుకుని, వాణ్ణి తన ఆస్థానంలో ఉంచుకుని, రెండేళ్ళపాటు వాడికి సకల విద్యలూ నేర్పించి, తరవాత వాడికే తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేశాడు.





# మాయదారి ముసలిది

## 3

ఖాలిద్ దిలైలాను ఆమె చేసిన దొంగతనా లను గురించి ప్రశ్నించాడు.

"మీ రడిగేది నా కేమీ అర్థం కావటం లేదు. నేను నా జన్మలో దొంగతన మన్నది చేసి ఎరగను," అన్నది దిలైలా.

అప్పటికే పొద్దు గూకింది. ఆ రోజుకు ఆమెను విచారణ చేసే అవకాశం లేదు. ఆమె మీద ఆరోపణలు చూడబోతే చాలా ఉన్నాయి. సాక్షులు కూడా చాలా మంది ఉన్నారు. ఆమె వాలకం చూస్తే ఒకంతట నేరాలను ఒప్పుకునేటట్టు కనబడలేదు. అందుచేత ఖాలిద్ ఆమెను ఆ రాత్రి అంతా చీకటికొట్టులో ఖైదు చేసి ఉంచి, తెల్లవారి విచారణ జరపనిశ్చయించాడు.

కాని జైలు అధికారి ఆమెను గురించి బాధ్యత వహించటానికి ఒప్పుకోక, "ఈమె పెద్ద మోసకారి. ఏదో ఉపాయం చేసి ఖైదు నుంచి తప్పించుకుపోతే నా పీక పోతుంది," అన్నాడు.

"అదీ నిజమే. విచారణ జరిగేదాకా, ఈ ముసలిదాన్ని నలుగురికీ కనిపించే చోటనే ఉంచి కాపలాకాయటం మేలు," అన్నాడు ఖాలిద్.

ఆయన గుర్రం మీద బయలుదేరాడు. ఫిర్యాదీలు అయిదుగురూ, దిలైలాను ఈడ్చుకుంటూ, ఆయన వెనకనే నగరం వెలపలకు వెళ్ళారు. అక్కడ బయలు ప్రదేశంలో దిలైలాను ఒక స్తంభానికి కట్టేయించి, ఫిర్యాదీలను అయిదుగురినీ ఆమెను కాపలాకాయమని చెప్పి, ఖాలిద్ తన ఇంటికి వెళ్ళిపోయాడు.

అయిదుగురూ ఆమె చుట్టూ కూర్చుని, చాలాసేపు ఆమెను నానాతిట్లూ తిట్టి, తమ కసి కొంత తీర్చుకున్నారు. అయితే భోజ

ఆర్. నాగభూషణం



నాలు చెయ్యగానే వారికి నిద్ర ముంచు కొచ్చింది. ఎందుకంటే, మూడు రాత్రులుగా వారికి నిద్ర అన్నది లేదు.

అర్ధరాత్రి దాటి చాలా సేపయింది. ఆ సమయంలో ఇద్దరు ప్రయాణీకులు చెరొక పక్క నుంచీ వస్తూ ఆ ప్రాంతంలో కలుసుకున్నారు. ఒకడు నగరం నుంచి వెళ్ళిపోతున్నవాడూ, రెండోవాడు నగరం చేరుతున్నవాడూనూ. వారిద్దరూ మాట్లాడుకున్న మాటలు దిలైలాకు వినిపించాయి.

"బాగ్దాదులో పొందదగిన అనుభవాలలో అన్నిటినీ మించినది ఏమిటి?" అని వచ్చేవాడు వెళ్ళేవాణ్ణి అడిగాడు.

"మీగడ పూసిన తేనెరొట్టెలు! నేనీ నగరంలో ఉన్న మూడు రోజులూ అవే తిన్నాను. ఏదైనా మొహం మొత్తవచ్చు గాని, ఇవి మాత్రం మొహం మొత్తవు. ఎంత తిన్నా ఇంకా తినాలనే అనిపిస్తుంది." అన్నాడు వెళ్ళేవాడు.

"భేష్! డబ్బు చూడకుండా, నేనీ నగరంలో ఉన్నన్నాళ్ళూ మీగడ పూసిన తేనెరొట్టెలే తింటాను." అన్నాడు వచ్చేవాడు.

వెళ్ళేవాడు ముందుకు సాగిపోయాడు. వచ్చేవాడు, దిలైలా స్తంభానికి కట్టేసి ఉన్న దిక్కుగా వచ్చాడు.

ఈ లోపల, సంభాషణ అంతా విన్న దిలైలా అప్పటికప్పుడే ఒక ఎత్తు ఆలోచించింది. ఆ ఎత్తు పారితే తాను తప్పించుకు పారిపోవచ్చు. ఆ వచ్చేవాడు పరదేశీ. వాడికి తాను ఎవరో, తన కథ ఏమిటో తెలియదు. అందుచేత వాడు తేలికగా మోసపోయే అవకాశం వుంది.

"నాకు వద్దు! నేను తినను!" అనటం ఆరంభించింది దిలైలా.

ఆ మనిషి ఆమెను సమీపించి, "ఏమిటమ్మా? ఎవరు నువు? నిన్నెందుకిలా కట్టి పెట్టారు? ఏమిటి తిననంటున్నావు?" అని అడిగాడు.

"ఏం చెప్పేది, నాయనా? నా భర్త తేనె రొట్టెలు తయారు చేసి, వాటిమీద మీగడ పూసి అమ్మి, లక్షలు గడించాడు. మొదట్లో నా కవి అంటే ఇష్టంగానే ఉండేది కాని, రానురాను వాటి పేరు చెబితేనే వాంతి అయే పరిస్థితి ఏర్పడింది. మొన్న మా దుకాణానికి ఒక గొప్ప అమీరు వచ్చాడు. అప్పుడు నా భర్త, ఆ అమీరుతో బాటు నన్ను కూడా తేనె రొట్టెలు తినమని నిర్బంధించాడు. నేను వాటిని నోట పెట్టుకో బోయేసరికే వాంతి అయినంత పని అయింది. ఆ అమీరుకు అనుమానం వచ్చి, తేనె రొట్టెలు తినకుండానే వెళ్ళిపోయాడు. నా భర్తకు డబ్బు నష్టం రావటంతోబాటు, తయారు చేసిన సరుకంతా వృథా అయి పోయింది. కాని తప్పు నా భర్తది. ఆయన నన్ను తేనె రొట్టెలు తినమని ఉండరాదు. అయినా, తప్పు నా మీదికే నెట్టి, నేను తన వ్యాపారాన్ని పాడు చేశానని నామీద ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి నాకు తేనె రొట్టెలు తినే శిక్ష విధించి, ఇక్కడ కట్టి పెట్టించాడు. తెల్లవారుతూనే రాజభటులు తేనె రొట్టెలు తెస్తారు. అవి, అందరూ చూస్తూండగా నేను తినాలి. తినేదాకా నాకు భోజనం పెట్టరు. నా కష్టాలు ఎందు కడుగుతావు, నాయనా?" అన్నది దిలైలా.






"అయ్యో, అవ్వా! పాపం, నీకెంత కష్టం వచ్చింది! అలాటి కష్టం నాకు రాకూడదూ?" అన్నాడు పరదేశీ.

"అదేం భాగ్యం, నాయనా? నా కట్లు విడిపించి, నా స్థానంలో నువు నిలబడి, నా చేత కట్టించుకుని, నాలాగే ముఖం మీద ముసుగు వేసుకున్నావంటే, ఇంకా స్నేపట్లో తేనె రొట్టెలు తెచ్చి, నిన్ను చూసి నేనే అనుకుని, మీగడతోసహా వాటిని నీచేత బలవంతాన తినిపిస్తారు!" అన్నది దిలైలా.

ఈ మాటలు నమ్మి పరదేశీ ఆమె కట్లు విప్పాడు. దిలైలా అతన్ని స్తంభానికి కట్టి, అతని ముఖాన ముసుగు వేసి, అతను ఎక్కి వచ్చిన గుర్రం మీదనే ఎక్కి, బాగ్దాదు నగరంలోకి వెళ్ళిపోయింది.

తెల్లవారగానే ఫిర్యాదీలు అయిదుగురూ నిద్రలేచి, స్తంభానికి కట్టి ఉన్నది దిలైలాయే అనుకుని, ఆమెను కసితీరా మళ్ళీ తిట్ట నారంభించారు.

ఈ తిట్లు కొంచెంసేపు విని, స్తంభానికి కట్టి ఉన్నవాడు, "ఇంతకూ తేనె రొట్టెలు రావేం?" అన్నాడు.

వాడి గొంతు విని నిర్ఘాంతపోయి, ఆ అయిదుగురూ వాడి ముఖం మీది ముసుగు తొలగించి చూశారు. ముసలిది మరోసారి తమ కళ్ళలో దుమ్ము కొట్టిందని వాళ్ళకు అర్థమయింది.

కొంతసేపటికి ఖాలిద్ స్వయంగా అక్కడికి వచ్చి, జరిగిన మోసం గురించి తెలుసుకున్నాడు. ఇది తనవల్ల తీరే ఫిర్యాదు కాదని అతనికి తోచింది. అతను అందరినీ వెంట బెట్టుకుని తిన్నగా ఖలీఫా వద్దకు వెళ్ళాడు.

ఖలీఫా హరూనల్ రషీద్ అందరి కథలూ విని, ఎవరికెవరికి ఎంతెంత నష్టం కలిగితే అంతా తాను సరి చేస్తానని మాట ఇచ్చాడు. అయినా ముసలిదాన్ని పట్టుకోవలిసిన అవసరం ఉన్నది. ఆ భారాన్ని ఖలీఫా ఖాలిద్ పైనా, ముస్తఫా పైనా వేశాడు.

అమెను పట్టటం నా వల్ల అయే పని కాదు," అన్నాడు ఖాలిద్ ఖలీఫాతో.

"అలా అయితే ఆ పనికి మరెవరినన్నా చూపు," అన్నాడు ఖలీఫా.

"కొత్త కొత్వాలు అహ్మద్ ఉండగా మరొక రెందుకు? ఆయన పదవిలోకి వచ్చి నాక ఇంతవరకూ ఎవరినీ పట్టుకున్నట్టు కనిపించదు. ఈ మాయదారి ముసలిదాన్ని పట్టితే ఆయనే పట్టాలి. ఈ పని కూడా చెయ్యలేకపోతే ఇక ఆయన ప్రజ్ఞ ఏమున్నది?" అన్నాడు ఖాలిద్.

ఖలీఫా అహ్మద్‌ను పిలిపించి, అతనికి ముసలిదాని కథ అంతా చెప్పి, అమెను పట్టుకోమని ఆజ్ఞాపించాడు.

అహ్మద్ ఆ క్షణమే తన నలభై మంది భటులతోనూ ముసలిదాన్ని పట్టుకోవటానికి బయలుదేరాడు.

ఆ భటుల పైన జమేదారు గూని అలీ అనేవాడు. వాడు తన యజమాని అయిన అహ్మద్‌తో, "అయ్యా, నా ఉద్దేశం మనం ఈ ముసలిదాన్ని పట్టటంలో హసన్‌గారి సహాయం కూడా తీసుకుంటే బాగుంటుం దని!" అన్నాడు.

"ఓరి గూని వెధవా! మన కింకొకరు సహాయం చేసేదేమిట్రా? మనం అంత



చాతకాని వాళ్ళమా? మరోసారి ఆ మాట అన్నావంటే మక్కెలు విరగబొడుస్తాను, జాగ్రత్త!" అని అహ్మద్ హసన్‌కు వినిపించేలాగా అన్నాడు.

ముసలిదాన్ని పట్టటానికి తనను కాదని ఖలీఫా అహ్మద్‌ను పురమాయించినందుకే కుళ్ళుతున్న హసన్, అహ్మద్ ప్రగల్భాలు విని మరింత కుళ్ళిపోయాడు. "నా సహాయం లేకుండా ఈ అహ్మద్‌గాడికి ముసలిది దొరికి నప్పటి మాట కద!" అనుకున్నాడు హసన్ తనలో.

అహ్మద్ తన నలభై మంది భటులనూ రాజభవనం వెలపల ఉన్న మైదానం మీదికి



"నన్ను నిజంగా పట్టగలవాడు హసన్ ఒక్కడే. ఖలీఫా అతన్ని నియోగించక పోవటం మన అదృష్టం. ఇక అహ్మద్ అంటావా? అతన్ని నువ్వయినా మూడు చెరువుల నీళ్ళు తాగించవచ్చు," అన్నది.

"అయితే నేను వెళ్ళి వాళ్ళను ఏడిపించి రానా, అమ్మా?" అని జీనాబ్ అడిగింది.

"అలాగే వెళ్ళిరా, తల్లీ!" అన్నది దిలైలా సంతోషంగా.

జీనాబ్ చాలా అందంగా అలంకరించుకుని, అతి పల్చని సిల్కు మేలి ముసుగు వేసుకుని, ముస్తఫా వీధిలో హజ్ కరీమ్ అనేవాడు నడుపుతున్న సరాయ్‌కి వెళ్ళింది. ఆమె హజ్ కరీముకు రెండు సలాములు పారేసి, "కొందరు ఆప్తమిత్రులు వస్తున్నారు. వారు మరెవ్వరితోనూ సంబంధం లేకుండా కాలక్షేపం చేస్తారు. అందుచేత మీ పెద్ద సావడి ఒక రోజుకు అద్దెకు ఇప్పించండి. అయిదు దీనారాలిస్తాను," అన్నది.

హజ్ కరీమ్ ఆ పిల్ల అందం చూసి, "అద్దె అవసరం లేదు. వచ్చే అతిథులు నా సారా ఖర్చు చేస్తే చాలు," అన్నాడు.

"దానికేమీ చచ్చుండదు. నా మిత్రులంతా చిల్లి కడవలే అనుకోండి," అన్నది జీనాబ్ నవ్వుతూ.

తెచ్చి, "వీరాగ్రేసరులారా! మిమ్మల్ని నాలుగు దళాలుగా విభజిస్తాను. నాలుగు దళాలూ నగరంలోని నాలుగు పేటలూ చక్కగా గాలించండి. రేపు మధ్యాన్నానికల్లా అందరూ ముస్తఫా వీధిలో ఉన్న సరాయ్ వద్దకు చేరండి. అక్కడికి నేను వచ్చి మీ అనుభవాలు వింటాను," అన్నాడు.

నాలుగు దళాలూ నాలుగు వైపులా బయలుదేరాయి. అహ్మద్ కూడా స్వయంగా ఆచోకీ తీయటానికి బయలుదేరాడు.

తనను పట్టటానికి ఖలీఫా అహ్మద్‌ను నియోగించినట్టు విని దిలైలా ఏ మాత్రమూ లక్ష్యపెట్టలేదు. ఆమె తన కుమార్తెతో,

ఆమె తమ ఇంటి నుంచి తివాసీలూ, బాలీసులూ, బల్లలూ, కంచాలూ, ఇతర సామాన్లూ మోయించి తెప్పించి, సరాయ్ లోని పెద్ద సావట్లో పరిపించింది; తిండీ, తాగుడూ సిద్ధం చేయించి, సరాయ్ ముఖ ద్వారం వద్ద కాపువేసి నిలబడింది.

కొంతసేపటికి గూని అలీ, మరి తొమ్మిది మంది భటులూ ఎకసక్కేలాడు కుంటూ అక్కడికి వచ్చారు.

జీనాబ్ గూని అలీని చూసి, "తమరేనా అహ్మద్?" అని అడిగింది.

"కాదు, కాదు. నన్ను గూని అలీ అంటారు," అని నవ్వుతూ అన్నాడు అలీ.

"అయితే, మీరంతా నా ఆతిథ్యం స్వీకరించండి," అంటూ జీనాబ్ వారిని సావట్లోకి తీసుకుపోయింది.

ఆ పది మందీ సారా పీపాచుట్టూ మూగి, తాగుడు మొదలుపెట్టారు. అందులో జీనాబ్ అదివరకే భంగు బాగా కలిపి ఉంచటంచేత, కొద్ది క్షణాలలోనే అందరూ ఒళ్ళు తెలియకుండా పడిపోయారు.

జీనాబ్ ఒక్కొక్క భటుణ్ణీ కాళ్ళుపట్టి దొడ్లోకి ఈడ్చుకుపోయి, కట్టెలు పేర్చినట్టు ఒకరి మీద ఒకర్ని పేర్చి, వారి మీద ఒక గుడ్డ కప్పి, హాలు శుభ్రం చేసి, మళ్ళీ తలవాకిట నిలబడింది.



కొద్దిసేపట్లో మరొక జట్టుకు చెందిన పది మంది భటులు వచ్చారు. వారిని కూడా జీనాబ్ ఆహ్వానించి తీసుకుపోయి, తాగించి స్పృహ లేకుండా చేసి, దొడ్లోకి ఈడ్చుకుపోయింది.

కాస్సేపటికి, అహ్మద్ గుర్రం మీద వచ్చి చేరాడు. అతను తలవాకిట ఉన్న జీనాబ్‌ను చూసి, "ఏం పిల్లా, నా భటులెవరైనా వచ్చారా?" అని అడిగాడు.

"తమరు కొత్వాలు అహ్మద్‌గారు కాదు కద! అలా అయితే, మీ భటులకు ఈ వీధి చివర ఎవతో ముసలిది కనిపించిందిట, ఆమెను పట్టుకోవటానికి వెళ్ళినట్టు తమతో మనవి చెయ్యమన్నారు. వాళ్ళు దాన్ని పట్టుకొచ్చేలోపుగా తమరు లోపలికి దయచేసి, నా ఆతిథ్యం స్వీకరించండి," అన్నది జీనాబ్ సలాం చేసి.

అహ్మద్ పరమానందంతో ఒప్పుకుని, తాగటం ప్రారంభించి, త్వరలోనే స్పృహ తప్పి పడిపోయాడు. జీనాబ్ అతని లోదుస్తులు తప్ప మిగిలిన బట్టలూ, ఆభరణాలూ కాజేసింది. ఆమె దొడ్లో ఉన్న నలభై మంది భటులనూ అలాగే దోచి, అహ్మద్ ఎక్కివచ్చిన గుర్రం మీద ఇంటికి వెళ్ళిపోయింది.

అహ్మద్, అతని భటులూ కూడా రెండు పగళ్ళూ, రెండు రాత్రులూ ఒళ్ళు తెలియకుండా నిద్రపోయి, మూడోనాటి ఉదయం మేలుకున్నారు. చాలాసేపు వారికి తామెక్కడ ఉన్నదీ తెలియలేదు. అయితే క్రమంగా వాళ్ళు తమకు జరిగిన మోసాన్ని కొంచెం కొంచెమే గ్రహించి, భరించరానంత సిగ్గుపడిపోయారు. లోదుస్తులు ధరించి వీధిలోకి వెళ్ళటం మరింత అవమానం. అయినా వెళ్ళక తప్పదు. పైన బనీనులూ, కింద చెడ్డీలూ ధరించి అహ్మద్, అతని భటులూ సాహసించి వీధిన పడ్డారు.

—(ఇంకా ఉంది)







# వీరాగ్రేసరుడు!

ధరణికోటలో ఒక కులీనుడూ, మహా ధనికుడూ అయిన క్షత్రియు డుండేవాడు. ఆయన పేరు శూరవర్మ. ఆయనకు ఒక చక్కని కుమార్తె ఉండేది. ఆమె పేరు మాలిని. మాలిని చాలా అందగత్తె మాత్రమే గాక, అంతులేని ఆస్తికి వారసురాలు కూడా కావటం చేత ఆమెను పెళ్ళాడటానికి అనేక మంది యువకులు విశ్వప్రయత్నాలు చేశారు. కాని వారి ప్రయత్నా లేవీ ఫలించ లేదు. ఎందుకంటే శూరవర్మ తన కుమార్తెను మహావీరుడికి తప్ప ఇవ్వనని పట్టుబట్టాడు.

ఆ నగరంలోనే ఒక క్షత్రియయువకు డుండేవాడు. మాలిని లాగే ఆ యువకుడు కూడా చాలా అందగాడు. అతని పేరు కీర్తి సింహుడు. అతని తాతముత్తాతలు రాజ్యాలు ఏలినవాళ్ళే. కాని అతను పేదవాడు. అతని కున్న ఆస్తి అంతా కలిసి ఒక తెల్లగుర్రమూ, ఒక ఖడ్గమూనూ. అతనికి ఎవరూ లేరు. అందుచేత రాజుగారి సేనలో చేరి పొట్ట పోసుకుంటున్నాడు.

ఒకనాడు కీర్తిసింహుడు చాలా దూరం ప్రయాణం చేసి వస్తూ నగరం వెలపల ఉన్న శూరవర్మ భవనం చూసి తన గుర్రాన్ని ఆపాడు. ఎండలో రావటం చేత అతనికి దాహం జాస్తిగా ఉన్నది. ఆ భవనంలో తనకూ, తన గుర్రానికీ నీరు దొరుకు తుందేమో నని అతను ఆశపడి లోపలి ఆవరణలో ప్రవేశించాడు.

భవనం ముందర సుందరమైన చెట్లూ, పూలమొక్కలూ గల ఉద్యానం ఉన్నది. చెట్ల మధ్య ఒక తామరకొలను వున్నది. ఆ కొలను గట్టు మీద మాలిని కూర్చుని ఉన్నది. ఆమె తల ఎత్తి కీర్తిసింహుడి కేసి చూసి, "ఎవరు మీరు? ఏం కావాలి?" అని అడిగింది.

సి. అనంతరావు



ఆమె అందం చూసి కీర్తిసింహుడు విస్మయం చెందాడు. నిజానికి అతని అందం చూసి మాలిని కూడా ఆశ్చర్యపడింది.

"చాలా దూరం నుంచి ఎండలో ప్రయాణం చేసి వస్తున్నాను. నేనూ, నా గుర్రమూ దప్పిగొని ఉన్నాం. మాకు నీరిప్పించగలరా?" అన్నాడు కీర్తిసింహుడు.

మాలిని చప్పట్లు చరిచింది. సేవకుడొకడు వచ్చాడు.

"వీరికి తాగటానికి నీరు తీసుకురా! తరవాత వీరి గుర్రాన్ని తీసుకుపోయి నీరు తాగించు," అన్నది మాలిని.

సేవకుడు వెళ్ళి, నీరు తెచ్చి కీర్తిసింహుడికి ఇచ్చి, గుర్రాన్ని తీసుకుపోయాడు.

దాహం తీరి ప్రాణం లేచివచ్చినట్టయి, కీర్తిసింహుడు చుట్టూ ఒకసారి కలయజూసి, "ఎంత చక్కని వాతావరణం! ఇక్కడ ఉండే మీరు విచారంగా ఉండటం విడ్డూరంగా ఉన్నది," అన్నాడు మాలినితో.

"నా విచారానికి కారణం ఉన్నది. నా కీ జన్మలో పెళ్ళి అయేటట్టు లేదు. నన్ను మా నాన్న మహావీరుడికి కాని ఇవ్వటడ! ఏ భీముడో, అర్జునుడో ఇంకా బతికి ఉంటే నాకు పెళ్ళి అవుతుంది. లేకపోతే కాదు!" అన్నది మాలిని, తన మనసులోని బాధను వెళ్ళగక్కుతూ.

"అంటే, నాబోటివాడికి అవకాశం ఉండదన్నమాట. నేను సామాన్య సైనికుణ్ణి. మా వంశం గొప్పదే గాని, నా కున్న ఆస్తి ఈ గుర్రమూ, ఈ కత్తీ మాత్రమే! నాకు పరాక్రమం ఉన్నది గాని, దాన్ని ఎవరిపైనా ఇంతవరకు చూపలేదు. ఆ అవకాశం వచ్చేసరికి నేను ఏ వయసులో ఉంటానో!" అన్నాడు కీర్తిసింహుడు.

"నన్ను సుఖపెట్టటానికి నీ వంటివాడు చాలు, కాని మా నాన్నను తృప్తిపరచటానికి నీ వంటివాడు పనికిరాడు," అన్నది మాలిని.

వాళ్ళు ఇలా మాట్లాడుతూండగానే సేవకుడు గుర్రానికి నీరుపెట్టి తెచ్చాడు.

"ఇక నువ్వు వెళ్ళిపోవటం మంచిది. నేను మొహం తెలీనివాళ్ళతో మాట్లాడుతున్నట్టు తెలిస్తే మా నాన్నకు ఆగ్రహం వస్తుంది," అన్నది మాలిని.

కీర్తిసింహుడు తన గుర్రాన్ని ఎక్కి ఇంటికి వచ్చేశాడు. కాని మాలినిని మరిచిపోవటం అతనికి సాధ్యం కాలేదు. ఆమెకు స్వేచ్ఛ ఉంటే తనను పెళ్ళాడుతుంది. ఆ నమ్మకం అతని మనోవ్యాధిని మరింత చేసింది. అతను రోజూ ఒంటరిగా కొండలలో తిరగటానికి వెళ్ళి, ఈ విషయమే ఆలోచించాడు.

ఒకనాడు అతను కొండలలో తిరుగుతూండగా ఒక గుడిసే, దాని ముందు కూర్చుని ఒక ముసిలిదీ కనిపించింది. ఆమె అతన్ని చూస్తూనే, "ఏమిటి, బాబూ, నీ విచారం?" అన్నది.

తన మనసులో ఉన్న మాట ఆ ముసిలిదానితో చెప్పుకోవా లనిపించింది కీర్తిసింహుడికి.

అతని కథ అంతా విని ఆమె, అతన్ని ఒక్క క్షణం ఆగమని, తన గుడిసెలోకి వెళ్ళి, ఒక డబ్బీ తెచ్చింది.



"ఈ డబ్బీలో ఒక చిన్న సాలీడు ఉన్నది. దీన్ని నేల మీద పడేస్తే, మంత్రప్రభావం వల్ల, ఒక మహాసర్పంగా మారిపోతుంది. దాన్ని నువు చంపావంటే నువు గొప్ప వీరుడివని ఖ్యాతి తెచ్చుకుంటావు. దీని సహాయంతో నీ కోరిక నెరవేరుతుందేమో చూడు," అంటూ ఆ డబ్బీని కీర్తిసింహుడికి ఇచ్చింది.

మర్నాడు కీర్తిసింహుడు ఆ డబ్బీని తన దుస్తులలో దాచుకుని శూరవర్మ ఇంటికి వెళ్ళాడు. శూరవర్మ అతన్ని లోపలికి రానిచ్చి, "ఏం పని మీద వచ్చావు?" అని అడిగాడు.



"నేను గొప్ప వంశానికి చెందిన సుక్షత్రియుణ్ణి. మా తాతముత్తాలు రాజ్యాలు ఏలారు. విధి వక్రించి నేను సాధారణ సైనికుడిగా ఉంటున్నాను. పేదవాణ్ణి కూడానూ. నాకు మీ కుమార్తెను పెళ్ళాడాలని కోరిక కలిగింది. ఆ మాట మీతో మనవి చేయటానికి వచ్చాను," అన్నాడు కీర్తిసింహుడు.

శూరవర్మ అతన్ని ఎగాదిగా చూసి, "నీ శౌర్యపరాక్రమాల మాట చెప్పు. మిగిలిన విషయాలతో నాకు పనిలేదు," అన్నాడు.

"నేను కొత్తగా చేరిన సైనికుణ్ణి. ఒకటి, రెండు దొమ్మీలలో పాల్గొన్నాను గాని, పెద్ద యుద్ధాలలో ఇంకా పాల్గొన లేదు. కాని అవకాశం దొరికితే ఎంత శౌర్యమైనా చూపగలను," అన్నాడు కీర్తిసింహుడు.

"ఏమైనా సాహసకృత్యాలు చేసి నాకు కనబడు. ఇప్పటికి నువు వెళ్ళవచ్చు," అన్నాడు శూరవర్మ.

కీర్తిసింహుడు తల వంచుకుని వచ్చేస్తూ, ఒక కిటికీ పక్కగా వచ్చి తన డబ్బీ తెరిచి, అందులోని సాలీడును కింద పడేశాడు.

మరుక్షణమే బయటి నుంచి పెద్ద కలకలమూ, హాహాకారాలూ వినవచ్చాయి. అందరూ పరిగెత్తుకుంటూ బయటికి వెళ్ళారు. శూరవర్మ కూడా వెళ్ళాడు.

బయట ఒక మహాసర్పం బుసలు కొడుతూ, భీభత్సం చేస్తున్నది.

"చూస్తారేమిత్రా? దాన్ని, చంపండి!" అని శూరవర్మ కేకలు పెట్టాడు. కాని ఎవరూ కదలలేదు. ఆ సర్పానికి వీలయినంత దూరంగా అందరూ పారిపోయారు.

"దాన్ని చంపటం ఎవరితరం, బాబూ? అది మామూలు పామా? మహా సర్పం!" అన్నారు వాళ్ళు.

"ఉండండి. దాని సంగతి నేను చూస్తాను," అని శూరవర్మతో అని, కీర్తిసింహుడు కత్తి దూసి, మహాసర్పాన్ని

సమీపించాడు. అది అతన్ని తోకతో విసురుగా కొట్టటానికి ప్రయత్నించింది. కీర్తిసింహుడు పక్కకు దూకి, దాని తోకను తన కత్తితో నరక యత్నించాడు. కాని పాము కత్తివేటును తప్పించుకున్నది.

ఆ మహాసర్పానికీ, కీర్తిసింహుడికీ చాలాసేపు తీవ్రమైన ఘర్షణ జరిగింది. ఆ సర్పం తనను తోకతో కొట్టటానికీ, శరీరంతో చుట్టటానికీ, నోటితో పట్టటానికీ చేసిన ప్రయత్నాలన్నిటి నుంచీ కీర్తిసింహుడు లాఘవంతో తప్పించుకున్నాడు. అతని కత్తిదెబ్బలను పాము కూడా చాలాసేపు తప్పించుకున్నది. కాని చివరకు కీర్తిసింహుడు సర్పం తోక నరకగలిగాడు. ఆ తరవాత ఆ సర్పాన్ని బలహీనపరిచి, దాని తలను తన కత్తితో చితకపొడవటం సాధ్యమయింది.

ఈ భయంకరమైన యుద్ధాన్ని చూస్తున్న వారందరికీ ముచ్చెమటలు పోశాయి. శూరవర్మ ముఖాన ఆనందం తాండవించింది. ఆయన కీర్తిసింహుణ్ణి సమీపించి, భుజం తట్టి, "భేష్! భేష్! నువు నిజంగా వీరాగ్రేసరుడవి," అని తన సేవకుల కేసి తిరిగి, "ఇతన్ని తీసుకుపోయి చక్కగా తలంటి స్నానం చేయించి, కొత్తబట్టలు కట్టబెట్టండి! పోయి పురోహితుణ్ణి పిలుచుకురండి!" అని ఆజ్ఞలు జారీచేశాడు.

తరవాత కీర్తిసింహుడికీ, మాలినికీ వైభవంగా వివాహం జరిగింది. తరవాత కొద్ది రోజులకు కీర్తిసింహుడు ఒక సంచీ, ఒక చిన్న డబ్బీ తీసుకుని, కొండలలో కాపరం ఉన్న ముసలిదాని వద్దకు వెళ్ళి, "ఇదుగో నీ బహుమానం! ఇది నీ డబ్బీ!" అన్నాడు.

ముసలిది సంచి విప్పి అందులో ఉన్న బంగారం చూసుకున్నది; డబ్బీ మూత తీసి అందులో వున్న సాలీడుపురుగును చూసుకున్నది; "వెయ్యేళ్ళు వర్ధిల్లు, నాయనా!" అని కీర్తిసింహుణ్ణి మనసారా ఆశీర్వదించింది.



# పిల్లలు పెట్టిన రూపాయలు

ఒక గ్రామంలో ఒక ధనికుడుండేవాడు. అతను ప్రజలను అమాయకులను చేసి మోసగించి చాలా డబ్బు సంపాదించాడు. ఆ గ్రామంలోనే ఒక మోసగాడు ఉండేవాడు. వాడు ధనికులను మోసగించి పొట్ట పోసుకునేవాడు. వాడికి ధనికుణ్ణి మోసగించాలని చాలా ఉండేది. అందుకని ఒకనాడు వాడు ధనికుడి దగ్గర ఒక నగ తాకట్టు పెట్టి పంద రూపాయలు అప్పు తెచ్చుకున్నాడు. తరవాత నాలుగు రోజులకు డబ్బు తీసుకుపోయి ధనికుడి కిస్తూ, "మీకు అనవసరంగా శ్రమ కలిగించాను. మీ డబ్బుతో అవసరం రానేలేదు," అన్నాడు. ధనికుడు ఎంచి చూసుకుంటే ఇరవైరూపాయలు ఎక్కువ ఉన్నాయి.

"వడ్డీ కింద ఇరవై ఇచ్చావే! నేను అంత ఆశాపాతకుణ్ణనుకున్నావా?" అన్నాడు ధనికుడు.

"నేను మీ డబ్బే మీ కిచ్చానండి. అదేమన్నా పిల్లల్ని పెట్టిందేమో!" అన్నాడు మోసగాడు. ధనికుడు మారు మాటాడకుండా డబ్బు పుచ్చుకుని నగ తిరిగి ఇచ్చేశాడు.

కొంతకాలం గడిచింది. మోసగాడు తన కూతురు పెళ్ళికని ధనికుణ్ణి వెయ్యిరూపాయలు అప్పు అడిగి, అయిదుమాసాలలో తీర్చుతానన్నాడు. ధనికుడు సరేనని ఇచ్చాడు.

అయిదుమాసాలయింది. ఆరుమాసాలయింది. డబ్బు తిరిగి రాలేదు. ధనికుడు మోసగాణ్ణి పిలిచి అడిగితే వాడు, "ఏం చెప్పమన్నారు? నా పిల్ల పెళ్ళి అయేలోపుగా తమరిచ్చిన డబ్బు కాస్తా చచ్చి ఊరుకుంది. దహనం కూడా చేశాను. పిల్ల పెళ్ళి ఎట్లాగో తెలీటం లేదు," అన్నాడు దిగులుగా. ధనికుడు మండిపోయి, "డబ్బెక్కడన్నా చస్తుందా? మోసం!" అన్నాడు.

"బాబుగారూ, పిల్లల్ని పెట్టేది ప్రతిదీ చస్తుంది. ఎవరినన్నా అడగండి," అన్నాడు మోసగాడు.

—ఎం. వేణుగోపాల్





# అద్దం

చాలా కాలం క్రితం ఒక కుగ్రామంలో వాంగ్ అనేవాడుండేవాడు. అది ఎంత కుగ్రామ మంటే దాని సమీపంలో రహదారి అన్నది లేదు. అక్కడి మనుషులు అమాయకులు. వాళ్ళందరిలోకీ అమాయకుడు వాంగ్.

ఒకసారి వాంగ్ బొగ్గుల కావడితో పట్టణానికి బయలుదేరాడు. అక్కడ బొగ్గులకు మంచి గిరాకీ అని చెప్పారు. వాంగ్ ఎన్నడూ ఊరు విడిచి వెళ్ళినవాడు కాడు.

వాంగ్‌ను అతని భార్య ఊరి చివర దాకా సాగనంప వచ్చి, "క్షేమంగా వెళ్ళి లాభంగా రా! వచ్చేటప్పుడు నాకో దువ్వెన్న పట్టుకు రా!" అన్నది.

"దువ్వెన్నా?" అన్నాడు వాంగ్ ఆశ్చర్యంగా. అతను ఆ మాట కూడా ఎన్నడూ వినలేదు. ఆ రోజుల్లో చీనా స్త్రీలు తలలో పెట్టుకునే దువ్వెనలు కొయ్యవి; వంపు తిరిగి ఉండేవి.

"అదుగో, అలా వుంటుంది," అంటూ వాంగ్ భార్య తూర్పున వెలాతెలా పోతున్న నెలవంకను చూపింది.

బొగ్గు సాంతం అమ్ముడయిన రోజు సాయంకాలం అతను పట్టణం నడిబజారులో, జనసమ్మర్దం మధ్యగా నడుస్తూ ఉండగా, అకస్మాత్తుగా అతనికి తన భార్య తెమ్మన్నది జ్ఞాపకం వచ్చింది. కాని దాని పేరు గుర్తు రాలేదు. దాని సంకేతం ఆకాశంలో ఉంటుందన్న మాట లీలగా స్ఫురించి, వాంగ్ తూర్పు ఆకాశం కేసి చూశాడు. అక్కడ గుండ్రని చందమామ కనిపించింది. తన భార్య కోరిన గుండ్రని వస్తువు ఏమై ఉంటుందా అని అతను ఆలోచిస్తూండగా ఎదురుగా ఉన్న దుకాణంలో ఒక గుండ్రని వస్తువు కనబడింది. వెంటనే వాంగ్ దుకాణం వాడు చెప్పిన ధరకు ఆ వస్తువును కొని, ఇంటికి బయలుదేరాడు.

చీనా జానపద కథ

తిరుగు ప్రయాణం కూడా చాలా రోజులు పట్టింది; అయినా వాంగ్ క్షేమంగానే ఇంటికి చేరుకుని, తాను తెచ్చిన వస్తువు తన భార్య కిచ్చాడు. అది అద్దం.

వాంగ్ భార్య ఆత్రంగా గుడ్డ విప్పి అద్దం పైకి తీసి, దాని కేసి చూసింది. అందులో ఆమెకు తన ప్రతిబింబం కనిపించింది. ఆమెకు అద్దమంటే ఏమిటో తెలియదు. ఆ మాటకొస్తే, ఆ గ్రామంలో ఎవరూ అద్దం ఎలా ఉంటుందో ఎరగరు. అందుచేత వాంగ్ భార్య, తన భర్త పట్టణం నుంచి ఇంకో భార్యను తెచ్చుకున్నా డనుకున్నది.

ఆమె ఆ అద్దం పట్టుకుని, ఆ గ్రామం లోనే ఉన్న తన పుట్టింటికి ఏడుస్తూ వెళ్ళి, తన తల్లికి అద్దం ఇస్తూ, "చూడు, నీ అల్లుడు పట్నం పోయి ఇంకో పెళ్ళాన్ని తెచ్చుకున్నాడు!" అన్నది.

ఆమె తల్లి అద్దంలో తన ప్రతిబింబం చూసి, "ఇంకో పెళ్ళాన్ని తెచ్చుకోదలిచిన వాడు పడుచుదాన్ని తెచ్చుకోక వయసు మళ్ళినదాన్ని తెచ్చుకున్నాడేమే?" అన్నది.

నలుగురూ పోగై గ్రామాధికారికి ఫిర్యాదు చెయ్యాలిసిందే నన్నారు. గ్రామాధికారి, వాంగ్‌నూ, అతని భార్యనూ, అత్తగారినీ పిలిపించి, వాంగ్ తెచ్చిన అద్దంలోకి చూశాడు. అందులో మరొక గ్రామాధికారి లాంటివాడు కనిపించాడు.

"నా మీద పోటీకి వీణ్ణి తెస్తారా? ఉండండి మీ మదం అణుస్తా!" అని గ్రామాధికారి ఫిర్యాదీలనూ, ముద్దాయినీ కొరడాలతో కొట్టమని భటుడితో అన్నాడు.

ఈ అన్యాయానికి అందరూ ఒక్కసారి గొల్లుమన్నారు. గ్రామాధికారి అబద్ధం చెబుతున్నాడని అద్దం పట్టుకుని నలుగురూ ఒకసారే లాగారు.

ఈ గలాభాలో అద్దం కాస్తా కిందపడి ముక్కలై పోయింది. దానితో అందరి కష్టాలూ ఈడేరాయి.






# మహాభారతం

దక్షిణసముద్రతీరప్రాంతంలో సౌభద్రమనే తీర్థం ఉన్నది. అర్జునుడు దానిలో స్నానం చెయ్యటానికి ఉపక్రమిస్తూండగా, అక్కడ ఉండే బ్రాహ్మణులు అతన్ని వారించి, ఈ విషయాలు తెలిపారు:

ఈ సౌభద్రతీర్థంతో బాటు, పౌలోమ, కారండవ, ప్రసన్న, భారద్వాజ తీర్థాలు కూడా ఆ ప్రాంతంలో ఉన్నాయి. నూరేళ్లుగా ఈ అయిదు తీర్థాలలోనూ ఎవరూ స్నానాలు చెయ్యటం లేదు. కావటానికి అవి పుణ్యతీర్థాలేగాని, వాటిలో మొసళ్ళు చేరాయి. వాటిలోకి దిగటం చాలా ప్రమాదకరం.

ఈ సంగతి విని కూడా అర్జునుడు, తాను మొసలికి భయపడి, సౌభద్రతీర్థంలో స్నానం చెయ్యకపోవటం, పౌరుషహీనమనుకున్నాడు. ఇంతవరకూ అతను ఏ ఒక తీర్థాన్నీ విడవకుండా సేవిస్తూ వస్తున్నాడు. అందుచేత ఈ తీర్థంలో కూడా సంకోచించకుండా దిగేశాడు.

నీళ్ళ కదలిక తెలుసుకుని ఆ తీర్థంలో ఉన్న పెద్ద మొసలి గబగబా వచ్చి అర్జునుడి పాదం పట్టుకున్నది. అర్జునుడు దానిని అలాగే ఒడ్డు దాకా ఈడ్చుకు వచ్చి, నీటిలో నుంచి నేల మీదికి విసిరివేశాడు.

వెంటనే దానికి మొసలి రూపం పోయి, కుదురైన అందమైన స్త్రీ రూపం వచ్చింది. ఈ మార్పు చూసి అక్కడ ఉన్న బ్రాహ్మణులతోపాటు అర్జునుడు కూడా దిగ్భ్రమ చెంది, "ఓ సుందరీ, నువ్వు ఎవతెవు? ఏ కారణం చేత మొసలి రూపం ధరించి ఈ మడుగులో

18. ద్వారకలో అర్జునుడు

ఉన్నావు? తిరిగి ఎలా మొసలి రూపం పోయింది?" అని అడిగాడు.

ఆమె అర్జునుడితో, "నేనొక అప్సరసను. నా పేరు వర్గ. సౌరభేయి, సమీచి, పస, లత అనే నా నలుగురు చెలికత్తెలూ శాప కారణంగా నాలాగే మొసళ్ళుగా మారారు. నాకు శాపవిమోచనం కలిగించినట్టే వారికి కూడా కలిగించి, పుణ్యం కట్టుకో," అన్నది.

"మీకు ఈ భయంకరమైన శాపం ఎందుకు వచ్చింది?" అని అర్జునుడు అడిగాడు. దానికి వర్గ తమ కథ ఇలా చెప్పింది:

"మేము అయిదుగురమూ దిక్పాలకుల నగరాలు చూడటానికి బయలుదేరి, అవి చూసుకుంటూ భూలోకానికి వచ్చాం. ఒక వనంలో మాకు ఒక బ్రాహ్మణుడు తపస్సు చేసుకుంటూ కనిపించాడు. అతను ఎంతో అందంగా ఉన్నాడు. దారుణమైన తపస్సులో ఉండి, అగ్నిహోత్రుడిలాగా వెలిగిపోతున్నాడు. అతని తపస్సు పాడు చెయ్యాలని మాకు దుర్బుద్ధి పుట్టింది. అతని ఎదట ఉద్రేకం కలిగించే మాటలాడాం; అతనికి మా మీద మోహం కలిగించటానికి గాను పాటలు పాడాం; రకరకాల నాట్యాలు చేశాం. మేము ఏం చేసినా అతను చలించ లేదు. మమ్మల్ని గడ్డిపోచల కన్న హీనంగా చూశాడు. అతనికి కామోద్రేకం కలిగించే





పనులు చేశాం. అతనికి కోపం వచ్చింది. మమ్మల్ని మొసళ్ళు కమ్మని శపించాడు! మేము వెంటనే అతని కాళ్ళమీద పడి, ఆడవాళ్ళ మీద అంతగా ఆగ్రహించటం అన్యాయమన్నాం. ఇలాటి శాపం అనుభవించటం కన్న చావు మేలన్నాం. అంతే, ఆయన మాకు నూరేళ్ళపాటు మొసలి జీవితం తప్పదనీ, ఆ తరవాత ఎవరు మమ్మల్ని పట్టుకుని ఒడ్డున పడవేసినా మా శాపం తీరిపోతుందనీ అన్నాడు. అది మొదలు మేమిక్కడ అయిదు తీర్థాలలోనూ మొసళ్ళ రూపంలో ఉన్నాం. నా వెంట మిగిలిన నాలుగు తీర్థాలకూ వచ్చి నా చెలికత్తెల శాపం కూడా తీర్చి, ఈ తీర్థాలన్నిటినీ పవిత్రం చెయ్యి."

ఆమె కోరిన ప్రకారంగానే అర్జునుడు మిగిలిన నాలుగు తీర్థాలలోనూ దిగి, అందులో ఉన్న అప్సరసలకు శాపవిమోచనం కలిగించాడు. అటు తరవాత ఆ అయిదు తీర్థాలకూ నారీతీర్థా లనే పేరు వచ్చింది.

అర్జునుడు అక్కడి నుండి తిరిగి మణిపురానికి వచ్చి, చిత్రాంగదతో కాపరం చేశాడు. కాలక్రమాన చిత్రాంగదకు బభ్రువాహను డనే కొడుకు కలిగాడు. ఆ పిల్లవాణ్ణి



చిత్రాంగద తండ్రికి వంశోద్ధారకుడుగా ఇచ్చేసి, అర్జునుడు, అక్కడికి సమీపంలోనే ఉన్న ప్రభాసతీర్థానికి వెళ్ళి, అందులో స్నానం చేసి, ఆ రాత్రి కొద్దిపాటి వర్షం పడుతూంటే, ఒక మర్రిచెట్టు కింద పడుకున్నాడు.

అక్కడ అర్జునుడికి గదు డనే యాదవుడు తటస్థపడి, కృష్ణుడి చెల్లెలైన సుభద్ర అంద చందాలను గురించి మాట్లాడాడు. సుభద్ర తిలోత్తమను మించిన అందగత్తె అని అర్జునుడు ఆదివరకే విన్నాడు. అతనికి ఇప్పుడు ఆ సుభద్రను చూడాలనీ, ఆమెను సాధించుకోవాలనీ ఆలోచన పుట్టింది. ప్రభాసతీర్థానికి







ఆమోదించి, అర్జునుణ్ణి రైవతకాద్రి మీద ఉంచటానికి నిశ్చయించి తనవెంట తీసుకు వచ్చాడు. అక్కడ కృష్ణార్జునులు ఆ పగలూ, రాత్రి కబుర్లతో గడిపారు, సుఖమైన భోజనం చేశారు, నృత్యగాన వినోదాలు అనుభవించారు. మర్నాడు తెల్లవారగానే కృష్ణుడు అర్జునుడికి రైవతకాద్రి మీద అన్ని సదుపాయాలూ ఏర్పాటు చేసి, ద్వారకకు వెళ్ళిపోయాడు.

తరవాత కొద్ది రోజులకే యాదవులు రైవతకాద్రి మీద ఒక గొప్ప ఉత్సవం జరిపారు. ఆ ఉత్సవం చూడటానికి ద్వారక నుంచి వసుదేవుడూ, ఉగ్రసేనుడూ, అక్రూరుడూ, బలరాముడూ, కృష్ణుడూ, ప్రద్యుమ్నుడు మొదలైన యాదవ కుమారులూ, దేవకీదేవీ, రేవతీ, రుక్మిణీ, సత్యభామా, జాంబవతీ మొదలైన అంతఃపుర స్త్రీలూ, సుభద్ర మొదలుగా గల కన్యలూ వచ్చారు. ఆ అందరి మధ్యా తిరిగే సుభద్రను చూసి అర్జునుడు విపరీతంగా మోహపరవశుడై కూడా ఏమీ చేయలేక మధనపడ్డాడు. ఉత్సవం ముగియగానే అందరూ ద్వారకకు తిరిగి వెళ్ళిపోయారు.

కృష్ణుడి అనుమతితో అర్జునుడు రైవతకాద్రిని విడిచిపెట్టి, ద్వారకను అని ఉన్న

ద్వారక ఏమంత దూరం కాదు. అక్కడికి పోతే కృష్ణుడు కనబడతాడు.

యాదవులకు యతు లంటే చాలా భక్తి. అందుచేత అర్జునుడు యతివేషం వేసుకుని ద్వారకకు వెళ్ళటానికి నిశ్చయించాడు. ఈ లోపల, అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ ప్రభాసతీర్థం చేరిన వార్త వేగులవాళ్ళ ద్వారా ద్వారకకు చేరింది. కృష్ణుడు అతన్ని చూడటానికి ప్రభాసతీర్థానికి వచ్చి, "ఇదేమిటి, అర్జునా? ఈ మారువేషం వేశావు దేనికి?" అని అడిగాడు.

అర్జునుడు తన మనసులో ఉన్న కోరికను కృష్ణుడికి చెప్పుకున్నాడు. కృష్ణుడు దాన్ని





ఒక ఉద్యానవనానికి చేరాడు. అక్కడికి వాహ్యాళికి వచ్చే బలరాముడు మొదలైన యాదవులు అర్జునుణ్ణి చూసి, దొంగ యతి అని తెలియక, అతనికి నమస్కారాలు చేసి, "తమరు ఏయే పుణ్యతీర్థాలు చూశారు? ఏయే పుణ్యక్షేత్రాలకు వెళ్ళారు? ఇక్కడ ఎంతకాలం ఉంటారు?" అని భక్తితో అడిగారు. అర్జునుడు వారికి తగిన జవాబు లిచ్చి, "చాతుర్మాస్యం ఇక్కడనే జరుపుదామనుకుంటున్నాను," అన్నాడు. చాతుర్మాస్యం అంటే ఆషాఢ శుక్లపక్షం నుంచి, కార్తిక శుక్లపక్షం దాకా నాలుగు నెలలు జరిపే నిష్ఠ.



ఈ మాట విని బలరాముడు చాలా సంతోషించి, తన వెంట ఉన్న కృష్ణుడితో, "ఈ యతికి సుభద్ర ఇంటి సమీపంలో ఉన్న పొదరింట్లో వసతి ఏర్పాటు చేతాం. ఏమంటావు?" అన్నాడు.

"ఈ యతి చూడబోతే అందగాడుగా ఉన్నాడు. మన సుభద్రకూడా సౌందర్యవతి. అందుచేత చివరకు ఎలా పరిణమిస్తుందోనని నా భయం!" అన్నాడు కృష్ణుడు.

"అలా అందరినీ సంశయించటం తగదు. ఈ యతికి సుభద్ర మందిరమే సరి అయినది," అన్నాడు బలరాముడు.

కృష్ణుడు తన అన్న మాట తోసివెయ్యటం భావ్యం కాదన్న ధోరణిలో బలవంతాన ఒప్పుకున్నట్టు నటించి, అర్జునుణ్ణి సుభద్ర మందిరం ఆవరణలో చేర్చి, అతని రహస్యాన్ని రుక్మిణీ, సత్యభామలకు మాత్రం తెలిపాడు. తరవాత సుభద్రతో, "అమ్మా, యతిని నీ తోటలో విడిదిచేయించాం. నువూ, నీ చెలికత్తెలూ అతను చెప్పినట్టు వింటూ, అతనికి కావలిసిన ఉపచారాలన్నీ చెయ్యాలి. అతని భోజనం, స్నానం విషయంలో ఏమాత్రమూ అజాగ్రత్తగా ఉండకు. యతిసేవ చేసి యాదవ కన్యలు ఎన్నో శుభాలు పొందారు," అన్నాడు.





కృష్ణుడు చెప్పినట్టుగానే సుభద్ర అర్జునుడికి సమస్త ఉపచారాలూ లోటులేకుండా చేస్తూ వచ్చింది. సుభద్ర అందం చూసి అర్జునుడు మోహపరవశుడు కావటమేగాక, ద్రౌపది చక్కదనాన్ని కూడా పూర్తిగా మరిచిపోయాడు. అతని తీర్థయాత్రల గడువు ఎప్పుడో దాటిపోయింది. కాని ఇంద్రప్రస్థానికి తిరిగి పోవాలన్న ఆలోచన అతనికి ఏమాత్రమూ లేదు.

అర్జునుడి స్థితి ఇలా ఉంటే, సుభద్ర కూడా అర్జునుడి కోసమే కలవరిస్తున్నది. ఆమెకు అర్జును డంటే గొప్ప భావం కలిగించినవాడు గదు డనే యాదవుడే. అదీగాక, కృష్ణుడు అర్జునుణ్ణి పదిమందిలోనూ మెచ్చుకోగా ఆమె విన్నది. యాదవులు తమ పిల్లలను దీవించేటప్పుడు, "అర్జునుడంత విలుకాడివి కా!" అనటం ఆమెకు తెలుసు. వీటన్నిటి మూలంగా సుభద్ర మనస్సులో అర్జునుడు బాగా స్థిరపడ్డాడు. అందుచేత, ఎవరైనా కురుజాంగలదేశాల నుంచి వచ్చినప్పుడు ఆమె అర్జునుడి వార్తలు అడిగి తెలుసుకునేది, అతని వర్ణనలు ఎంతో శ్రద్ధగా వినేది.

ఒకనాడు అర్జునుడు ఒంటరిగా ఉన్నప్పుడు సుభద్ర అతని సపర్యలన్నీ ముగించి, "మీరు ఏ దేశాలు చూశారు? మీకు ఇంద్రప్రస్థం తెలుసా? మా మేనత్త కుంతీదేవి క్షేమంగా ఉన్నదా? ధర్మరాజు మొదలైన వారు కులాసాగా ఉన్నారా? పెద్ద కళ్ళూ, పొడుగాటి చేతులూ గల అర్జునుడు మీకు తెలుసా? అతను మహాశూరుడు, పరాక్రమవంతుడు," అన్నది.

దానికి అర్జునుడు, "ఇంద్రప్రస్థంలో కుంతీ, పాండవులూ, ద్రౌపదీ సుఖంగా ఉన్నారు. వారికి తెలియకుండా అర్జునుడు మాత్రం యతివేషం వేసుకుని, ద్వారకలో సుభద్ర ఎదట ఉన్నాడు! నేనే అర్జునుణ్ణి. నీకు నా పైనగల ప్రేమ కంటె నాకు నీపైన



ఎన్నోరెట్లు ప్రేమ ఉన్నది. ఒక మంచి రోజున నేను నిన్ను పెళ్ళాడి వైభవంగా ఉంటాను," అన్నాడు.

సుభద్ర చాలా సిగ్గుపడిపోయి, తల ఎత్త లేదు. అర్జునుడు తన లతా గృహానికి వెళ్ళిపోయాడు.

వారిద్దరి మనస్థితీ గ్రహించి కృష్ణుడు అర్జునుడి సేవలకు రుక్మిణిని నియోగించాడు. అర్జునుణ్ణి ప్రత్యక్షంగా చూసినది మొదలు సుభద్ర పిచ్చిఎత్తిన దానిలాగా అయిపోయి, నిద్రాహారాలు మానేసింది.

దేవకీదేవి తన కూతురి అవస్థ గ్రహించి, "ఎందుకు కుమిలి పోతావే, పిచ్చిదానా? నీ విషయం మగవాళ్ళతో చెప్పి నీ కోరిక తీరేటట్టు చూస్తాను," అని మాట ఇచ్చింది.

ఆమె సుభద్ర విషయం తన భర్త అయిన వసుదేవుడికి చెప్పింది. ఆయన ఈ సంగతి ఉగ్రసేనుడికీ, అక్రూరుడికీ, మరికొందరు హితులకూ చెప్పి, కృష్ణుడి అనుమతితో, బలరాముడికి తెలియకుండా, పదిరోజుల అనంతరం సుభద్రార్జునుల వివాహానికి ముహూర్తం నిశ్చయించాడు. అందుకోసం అంతర్ద్వీపంలో పన్నెండు రోజులపాటు ఉత్సవం జరపాలని చాటింపు వేయించాడు.

ఈ అంతర్ద్వీపం పది యోజనాల నిడివి గలది. ఈ ఉత్సవం కోసం ద్వారక నుంచి ఆబాలగోపాలమూ ఆ ద్వీపానికి వెళ్ళారు. తన వివాహానికి కృష్ణుడు కూడా దగ్గిర ఉండాలనే ఉద్దేశంతో అర్జునుడు సుభద్రను పురికొల్పి కృష్ణుణ్ణి అడిగించాడు; ఆమె కృష్ణుడితో, "అన్నా, నువు కూడా అంతర్ద్వీపానికి పోతే యతిసేవ సాగదు. అందుచేత నువు ఉండి పో!" అన్నది.

దానికి కృష్ణుడు, "ఈ సమయంలో యతిసేవకు నువు తప్ప ఇంకెవరూ పనికి రారు," అని తాను కూడా అంతర్ద్వీపానికి వెళ్ళిపోయాడు.





# బస్రా నావికుడు

బస్రాలో పూర్వం అబుల్ ఫవారిస్ అనే వాడుండేవాడు. అతను ఆ నగరంలోని నావికులందరికీ పెద్ద. సముద్రాల మీద అతను చూడని రేవు లేదని చెప్పుకునేవారు.

ఒకనాడు అబుల్ ఫవారిస్ సముద్ర తీరాన తన కళాసుల మధ్య కూర్చుని ఉండగా ఒక వృద్ధుడు అతని వద్దకు వచ్చి, "నీ ఓడను ఆరు నెలలపాటు బాడుగకు తీసుకుంటాను. కిరాయి ఎంతో చెప్పు," అని అడిగాడు.

"వెయ్యి బంగారు దీనారాలు ఇవ్వండి," అన్నాడు నావికుడు అబుల్ ఫవారిస్.

వృద్ధుడు వెంటనే అతనికి అంత సొమ్మూ ఇచ్చి, "రేపు మళ్ళీ వస్తాను, మాట తప్పితే ఊరుకోను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

నావికుడు ఆ డబ్బు తీసుకుని ఇంటికి వెళ్ళి, తన ఓడను ప్రయాణానికి సిద్ధం చేసి, తన భార్యకూ, బిడ్డలకూ వీడ్కోలు చెప్పి రేవుకు వచ్చాడు. అక్కడ ఆ వృద్ధుడు అతని కోసం ఎదురు చూస్తున్నాడు. వృద్ధుడి వెంట ఒక బానిసా, అనేక ఖాళీ గోనె సంచులూ ఉన్నాయి.

అబుల్ ఫవారిస్ సహాయంతో సంచు లన్నిటినీ ఓడలో చేర్చి, వృద్ధుడు తన బానిసతోసహా ఓడలోకి ఎక్కాడు. ఓడ రేవు నుంచి బయలుదేరి ఒకే దిక్కుగా మూడు నెలలు ప్రయాణం చేసి ఒక లంకను చేరింది. వృద్ధుడు చుక్కాని వద్ద కూర్చుని ఓడను తిన్నగా లంకకు నడిపాడు.

ఓడ తీరాన్ని తగలగానే లంగరు దింపారు. వృద్ధుడు తన బానిస నెత్తిన కొన్ని గోతాలు పెట్టి, అబుల్ ఫవారిస్‌ను వెంట పెట్టుకుని, లంక మీదికి బయలుదేరాడు.

కొద్ది గంటలసేపు నడిచి వారొక కొండను చేరుకున్నారు. వాళ్ళు కొండ మీదికి ఎక్కారు. అక్కడ విశాలమైన సమప్రదేశం





"ఈ గుంటలలోకి ముత్యపుచిప్పలు ఎలా వచ్చాయి?" అని నావికుడు వృద్ధుణ్ణి అడిగాడు.

"ఈ గుంటలకూ సముద్రానికి మధ్య సొరంగా లున్నాయి. వాటికుండా గుల్ల చేపలు వచ్చి ఈ గుంటలలో చేరుతాయి. మనిషి సహాయంకోసం నిన్ను వెంట తెచ్చాను. అందుచేత ఈ రహస్యం మరెవరికీ తెలియనివ్వకు," అన్నాడు వృద్ధుడు.

నావికుడు ఆత్రంగా గుంటలోకి దిగాడు. దాని అడుగున ఎన్నో ముత్యపు చిప్ప లున్నాయి. వృద్ధుడు తాళ్ళు కట్టి తట్టను దింపి, చాలాసార్లు ముత్యపుచిప్పలను పైకి తోడుకున్నాడు. చివరకు ఆయన, "ఇంక ముత్యపుచిప్పలు తీయకు. వీటిలో ఒక్క ముత్యం కూడా లేదు. అన్నీ ఉత్త గుల్లలు," అని కేకపెట్టాడు.

అబుల్ ఫవారిస్ ఆ గుంటలో నుంచి పైకి వచ్చి, మరొక గుంటలోకి దిగాడు. అందులో అంతులేని ముత్యపుచిప్ప లున్నాయి. చీకటి పడేదాకా అతను వాటిని తట్టలో పోసి, వృద్ధుడికి అందించి, తెగ అలిసిపోయి, "ఇక నాకు శక్తి లేదు. నన్ను పైకి లాగు," అని కేక పెట్టాడు.

కనిపించింది. అందులో రెండు వందలకు పైగా, లోతైన పెద్ద పెద్ద గోతులు తవ్వ బడి ఉన్నాయి.

వృద్ధుడు అబుల్ ఫవారిస్‌తో, "నీకొక రహస్యం చెబుతాను. దాన్ని నీ మనసులోనే ఉండనీ. నేకొక వర్తకుణ్ణి. ఈ ప్రదేశంలో నేనొక పెద్ద-రత్నాలనిధి కనిపెట్టాను. నువు నాకొక ఉపకారం చెయ్యాలి. ఈ గోతిలోకి దిగి ముత్యపుచిప్పలు తోడు. ఈ సంచు లన్నీ నించుకుందాం. వీటిలో సగం నీకూ, సగం నాకూనూ. వీటితో మన ఇద్దరి జీవి తాలూ మహారాజు లాగా వెళ్ళిపోతాయి," అని చెప్పాడు.





"నువు ఆ గుంటలోనే ఉండు. నిన్ను పైకి తీసినాక నువు నన్ను ముత్యాల కోసం చంపేస్తావేమో! నాకేమిటి నమ్మకం?" అన్నాడు వృద్ధుడు.

"నాకు అలాటి ఆలోచన ఏ కోశానా లేదు. నా మాట నమ్ము!" అని అబుల్ ఫవారిస్ కేకలు పెట్టాడు. కాని వృద్ధుడు వినిపించుకోకుండా కొండ దిగి వెళ్ళిపోయి, రేవు చేరి, ఓడలో ప్రయాణమయాడు.

అబుల్ ఫవారిస్ ఆ గోతిలో మూడు రోజులు గడిపి, ఆకలి దప్పులతో చాలా బాధ పడ్డాడు. అతను బయట పడటానికి కారాడు తూంటే అతనికి మనుషుల ఎముకలు అనేకం తగిలాయి. వృద్ధుడు తనను మోసం చేసినట్టే ఇంకా చాలామందిని మోసగించా డన్నమాట!

అబుల్ ఫవారిస్ ఉత్త చేతులతో గుంట చుట్టూరా మన్ను పీకి చూస్తూంటే ఒక చోట చిన్న ద్వారం ఉన్నట్టు తోచింది. దాన్ని చేతులతోనే పెద్దది చేసిన మీదట అతను దూరేపాటి దారి కనబడింది. దాని కుండా అతను పాకుతూ వచ్చి, కొంత సేపటికి మెడ లోతు నీటిలో పడ్డాడు. చీకటిలో ఏమీ కనిపించలేదు. నీరు నోటికి ఉప్పగా ఉన్నది. ఆ నీటిలో ఈదుకుంటూ



మరి కొంతదూరం పోయాక దూరాన కొద్ది కాంతి కనబడింది. అతనికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. అది అతడున్న సొరంగానికి వెలపలి ద్వారం.

ఆ సొరంగాన్ని గడిచి అబుల్ ఫవారిస్ సముద్రతీరం చేరుకున్నాడు. అతను నీటి ఒడ్డున కూర్చుని తన గతి ఇలా అయి నందుకూ, ముందు ఏమి కానున్నదో అనీ విచారించసాగాడు.

అతను సముద్రం మీదికి చూస్తూ ఉండగా ఏదో ఓడ అతని కనుచూపుమేర లోకి వచ్చింది. దాని నిండా మనుషు లున్నారు. అతను చివాలున లేచి నిలబడి,

నెత్తి మీది తలపాగా తీసి, గాలిలో ఎగర వేస్తూ గొంతు చించుకుని కేకలు పెట్టాడు.

ఓడ అతని కేసి రాసాగింది. తనకు కలిగిన అనుభవం గురించి ఆ ఓడలోని వాళ్ళకు చెప్పరాదని అతను నిర్ణయించుకున్నాడు. ఓడ అతని సమీపంలో ఆగి, అతన్ని ఎక్కించుకున్నది.

"ఈ లంకకు ఎలా చేరావు?" అని ఓడలో ఉన్నవాళ్ళు అతన్ని అడిగారు.

"నేనెక్కిన ఓడ సముద్రం మీద పగిలి పోయింది. ఒక కొయ్యపలక ఆధారంతో తేలి, ఇక్కడికి కొట్టుకు వచ్చాను," అన్నాడు అబుల్ ఫవారిస్. ఓడలోవాళ్ళు అతని అదృష్టాన్ని కొనియాడారు.

"మీ ప్రయాణం ఎక్కడి నుంచి ఎక్కడికి?" అని అబుల్‌ఫవారిస్ వారిని అడిగాడు.

"మేము అబిసీనియా నుంచి వస్తున్నాము. మేము వెళుతున్నది హిందూస్తానుకు," అన్నారు వాళ్ళు.

"నాకు హిందూస్తానానికి వెళ్ళే పని ఏమీ లేదు," అన్నాడు అబుల్ ఫవారిస్ సంకోచంగా.

"నీకు సంకోచం అవసరం లేదు. మాకు బస్రా పోయే ఓడలు ఎన్నో ఎదురు వస్తాయి. ఏదో ఒక ఓడలో ఎక్కించి నిన్ను బస్రా చేర్పిస్తాము," అన్నారు ఓడవాళ్ళు.

వాళ్లు ఆ మాట అన్న మీదట అబుల్ ఫవారిస్ వారి ఓడలో ప్రయాణం చెయ్యటానికి సమ్మతించాడు.

ఆ ఓడ నలభైరోజులు సముద్రం మీద ప్రయాణించినా ఒక్కసారి కూడా తీరం తగలలేదు. "మీరు దారి తప్పలేదు గద?" అని అబుల్‌ఫవారిస్ ఓడవాళ్ళను అడిగాడు.

"అయిదు రోజులుగా ఓడ ఎటు పోతున్నదీ మాకే అంతు చిక్కటం లేదు," అని ఓడవాళ్ళు నిజం బయటపెట్టారు!

ఆ తరవాత అందరూ చాలాసేపు ప్రార్థనలు చేశారు. —(ఇంకా వుంది)



# 105. సూయజ్ కాలవ

సినాయ్ ఎడారి మధ్యగా ప్రవహించే ఈ కాలవ మధ్యధరా సముద్రాన్నీ, ఎర్రసముద్రాన్నీ కలుపుతుంది. 1869 లో పుట్టిన ఈ కాలవ నిడివి 100 మైళ్ళు, వెడల్పు సగటున 198 అడుగులు. సముద్రయానాలు చేసే స్టీమర్లు ప్రయాణం చెయ్యటానికి తగినంత లోతున్నది. లండను నుంచి బొంబాయికి వచ్చే నౌకలు ఆఫ్రికాకు దక్షిణంగా ఉన్న సముద్ర మార్గాన వచ్చేకన్న సూయజ్ కాలవ గుండా వస్తే, మార్గం 5000 మైళ్ళ చిల్లర తగ్గుతుంది.



Photo by Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

తప్పితే తిరిగవు

పంపినవారు:
కె. కె. చారి, మద్రాసు-17

Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

తప్పితే ఒరిగేవు

పంపినవారు:
కె. కె. చారి, మద్రాసు-17

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 అక్టోబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి అయిన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి)

★ ఆగస్టు నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తిప్పితే తిరిగేవు

రెండవ ఫోటో : తప్పితే ఒరిగేవు

పంపినవారు : కె. కృష్ణమాచారి,
టి. నగర్, మద్రాసు - 17

బహుమతి మొత్తం రు. 20/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




మద్రాసు దగ్గర మహాబలిపురం అని ఓ వూరుంది. 1200 ఏళ్ళ క్రితం మహేంద్రవర్మ అనే పల్లవ రాజు అక్కడ ఎన్నో చక్కటి శిల్పాలు చెక్కించాడు. ఆ వూళ్ళో బాలరాజు అనే అబ్బాయి వున్నాడు. అతనికి తల్లి తండ్రి లేరు. వూరు చూడ్డానికి వచ్చిన యాత్రికులకు శిల్పాలు చూపించి, వాటి చరిత్ర చెప్పి రూపాయీ అర్ధా గడించి, తన చెల్లెలు రాధనీ, తన మామనూ, అత్తనూ వారి పిల్లల్నీ కూడా పోషించేవాడు.

ఆ వూళ్ళోనే ఒక శిల్పి వున్నాడు. బాలరాజు, బడికి వెళ్ళడానికి డబ్బు లేకపోయినా ఆయన వద్దకు వెళ్ళి ఎన్నో విషయాలు నేర్చుకునేవాడు. ఒక రోజు ఆ శిల్పికి 7 శాసనాలు చెక్కిన రాయి దొరికింది. దాని మీద వున్న వాక్యాలు ఏమిటంటే: 1. ఆశ కొలదిగ పెరుగు అవనిలో నిరాశ. 2. ఒక్క వేలు చూపి ఒరులను నిందించ వెక్కిరించు నిన్ను మూడు వేళ్ళు.' 3. తెలుపు క్షీర మెకాదు నలుపు నీర మెకాదు. 4. పెద్దవారికి నీవు చేదోడు కావలదు 5. అలవి మీరిన వేళ అమృతము విష మవును 6. తాడు పామనుకొనకు పాము తాడనుకొనకు 7. కలిసివచ్చిననాడు కడుపేద రాజగును. ఇవి జీవిత సత్యాలు. ఇవి అందరిపట్ల ఎప్పుడో అప్పుడు నిజమవుతాయని శిల్పి చెప్పాడు. ఇవే తనక తనపట్ల నిజమయితే దేవుడి బొమ్మలకే కాక కనిపించిన ప్రతి రాతికీ మొక్కుతానని బాలరాజు శపథం చేశాడు.

మర్నాడు జగన్నాధంగారని ఒక ధనికుడూ ఆయన భార్యా వూరు చూడ్డానికి వచ్చారు. బాల రాజునీ రాధనూ చూసి ముచ్చటపడి పెంచుకుందామనుకున్నారు. కానీ ఈలోగా తమ ఫ్యాక్టరీ కాలిపోయిం దని టెలిగ్రాం వచ్చింది. బాలరాజు అదృష్టం మంచిది కాదని అనుకొని వాళ్ళు వెళ్ళిపోయారు. డబ్బున్న వాళ్ళ యింటికి వెడదామని ఆశపడ్డ బాలరాజు నిరాశ పడ్డాడు. మొదటి శాసనం రైటైంది.

ఏ. పి. నాగరాజన్





ఇలాగే మిగతా శాసనాలు కూడా ఒక్కొక్కటి రైటవడం జరిగింది.

అందమైన కాలేజీ అమ్మాయిలు వచ్చారు. తన మీద దొంగతనం వేశారు.

సినిమా షూటింగవుతూంటే ఆ సంగతి తెలీక ఆ విలన్ వేషం వేసేవాడిని తన్నబోయాడు.

బీచిలో స్నానం చేస్తున్న దొరల కెమెరా ఓ దొంగ ఎత్తుకుపోతూంటే వాడిని పట్టుకుని తన్ని కెమెరా మళ్ళీ దొరలకి అప్ప చెప్పి వంద రూపాయలు బహుమానం పొందాడు.

ఏడుగురు సంతానంతో వచ్చిన దంపతులకి వూరంతా చూపించి పాటలు పాడి పిల్లల్ని ఆడించి వాళ్ళని మెప్పించాడు. కొండ చిట్టచివర కెక్కిపోయి భయంతో కేక లేస్తున్న వాళ్ళ పాపని ధైర్యంగా పైకెళ్ళి కాపాడాడు.

దొంగ సాధువుని చూసి నిజం సాధువనుకున్నాడు. సాధువు వేషంలో వున్న సి. ఐ. డి. ఆఫీసర్ని చూసి దొంగనుకున్నాడు. ఇలా రోజురోజుకీ — ఎన్నో తమాషాలు జరిగాయి. అన్ని శాసనాలూ తనపట్ల నిజమయ్యాయి.

చివరకి తన రాశి మంచిది కాదని వెళ్ళిపోయిన దంపతులే మళ్ళీ వచ్చి బతిమాలి తీసి కెళ్ళారు. అంతేకాక బీదవాళ్లైన తన మామ కుటుంబాన్ని కూడా తీసి కెళ్ళారు.

ఇదే 'బాలరాజు కథ' సినిమా. బాలరాజుగా మాస్టర్ ప్రభాకర్ మిమ్మల్ని నవ్విస్తాడు, పాడిస్తాడు, ఆడిస్తాడు, 'మహాబలిపురం — భారతీయ కళా జగతి కిది గొప్ప గోపురం' కట్టించాడూ ఈ వూరు పల్లవరాజూ ఆ కథ చెప్పగ వచ్చాడూ బాలరాజూ, అని పాడుతూ మహాబలిపురం శిల్పాలూ విశేషాలూ అన్నీ, మిక్కిలినేనికీ, హేమలతకీ, మీకూ కళ్ళకు కట్టేట్టు చూపిస్తాడు.

'హిప్పీ హిప్పీ ఆడపిల్లలోయ్ వీళ్ళు చెప్పరాని గొప్ప గొప్ప తారాజువ్వలోయ్' అని సంధ్యారాణి, కనకదుర్గ మొదలైన కాలేజీ అమ్మాయిల ఫేషన్లు హేళనచేస్తాడు.







'చెప్పో చెప్పోర్ భాయి చెప్పో చెప్పు, జరిగేది విప్పిచెప్పు....వేమన్న చెప్పింది వేదవాక్కు, పోతులూరయ్య చెప్పింది సత్యవాక్కు, ఈ బాలరాజు చెప్పింది బ్రహ్మవాక్కు. అది కాదన్న వాణ్ణి పట్టి నోరునొక్కు' అంటూ సుమ, విశ్వేశ్వరరావు, మొద్దబ్బాయి, రామచంద్రరావు కలిపి భాంగ్రాడ్యాన్సు చేస్తారు. అయిదు వేళ్ళకీ బొమ్మలు వేసి 'చూడు చూడు తమాషా భలే తమాషా — వేడుకైన తమాషా వేళ్ళ తమాషా అయిదు వేళ్ళ తమాషా' అని తమాషా కథ చెప్తాడు.

'ఒక్క రాతినీ కాలికిందేసి తొక్కుతువుంటా రెందుకు వేరొక్క రాతికీ చేతు లెత్తుకుని మొక్కుతువుంటా రెందుకు' అని స్వాముల వారిని ధర్మ సందేహాలడుగుతాడు.

'ఒకటి రెండు మూడైతే ముద్దు — అంతకు మించిన సంతానమైతే వద్దు వద్దూ వద్దూ' అని సూర్యకాంతమ్మకీ, సాక్షి రంగారావుకీ బుద్ధిచెబుతాడు.

నాగభూషణాన్ని తాగుడు మాన్పించి చక్కగా వుద్యోగంలో చేర్పించి మంచి మనిషిని చేస్తాడు.

కానిస్టేబుల్సు అల్లు రామలింగయ్య, రామచంద్రరావుల తరపున కేసులు పట్టుకుంటాడు.

అవుట్‌డోర్ షూటింగు చేస్తున్న గ్రేట్ డైరెక్టర్ రావి కొండలరావుని కంగారు పెట్టేస్తాడు.

ప్రభాకర్ చెల్లెలు సుమ ముద్దుమాటలు వినడానికి మీరు బాలరాజు మళ్ళీ మళ్ళీ చూస్తారు.

బాలరాజుకి మాటల్లో ముళ్ళపూడి వెంకటరమణ, ఫోటోగ్రఫీలో సెల్వరాజ్, పాటల్లో ఆరుద్ర, కొసరాజు, కె. వి. మహదేవన్, దర్శకత్వంలో బాపు సహాయం చేశారు.

వినాయకచవితినాడు 'బాలరాజు కథ' మీ వూరికి వస్తుంది. తప్పక చూడండి. పాపం మీ అమ్మా నాన్న అత్తయ్య మావయ్యలని కూడా తీసి కెళ్ళండి.





అందమైన చందమామలాంటి
బాలరాజు వస్తున్నాడు

# సవ్యమైన పెంపకానికి రక్తి
# బోర్న్‌విటా శక్తి !



ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు. వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటలల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు — క్యాడ్‌బరిస్






**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**










# వానాకాలంలో హాయిగా తిరుగుటకు
# ఆరు నాజూకైన జోళ్లు










* పన్నులు అదనం

మీకు దగ్గరలో నున్న కరోనా రిటెయిల్ షాపుకు వెంటనే వెళ్లి,
ఈ సొగసైన వానాకాలపు జోళ్ల రకాలను చూడండి.

## కరోనా పాదరక్షలు

*త్వరగా అరగవు, త్వరగా చిరగవు!*

కరోనా సాహు కం. లి.

